# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 34
22-8-1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


# సమర సన్నద్ధతలో నెల్లూరులో సి. పి. ఎం. - ఆర్. ఎస్. ఎస్. లు!

**ప్రతివీధిలో పోలీసుగుడారం- రాత్రీ పగలు సంచారం!**

మా ప్రత్యేక విలేఖరి

నెల్లూరులో సి. పి. ఎం. ఆర్. ఎస్. ఎస్. సంస్థలు సమరానికి సన్నద్ధమౌతున్నాయి. ఇరుపక్షాలూ తమ సైన్యాలను మొహరిస్తున్నాయి; తరచ్వరం కవ్వింపు చర్యలకు తలపడుతున్నాయి; ఉభయ నాయకులూ ఉద్రేకపూరిత ప్రకటనలు చేస్తున్నారు; ప్రతికారేచ్ఛతో సెగలు క్రక్కుతున్నారు; టౌనులో ఏమూల చూసినా ఉద్రిక్తవాతావరణం అలముకొని వుంది; భయకంపిత పరిస్థితి నెలకొని వుంది.

నిజానికి, చాలాకాలంనుంచే నెల్లూరులో ఆర్. ఎస్. ఎస్. మార్క్సిస్టుల సంబంధాలు హింసాత్మకంగావున్నాయి. కాలేజివిద్యార్థిసంఘాల ఎన్నికలలో అవి అడపాదడపా బయటపడుతుండేవి. కాని, మొన్న 14 తేది ఉదయం భక్తవత్సల నగర్‌లో ఉభయులూ తొలిసారిగా కత్తులు దూసుకున్నారు; తలపడి కొట్టుకున్నారు.

భక్తవత్సలనగర్ మొదటినుంచి మార్క్సిస్టులకు బలమైనస్థానం. అక్కడ ఖాళీస్థలాల దురాక్రమణ, తొలగింపు నిరోధక కార్యక్రమాలన్నీ వారి కనుసన్నల్లోనే జరుగుతుంటాయి. ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తలు కొందరు అక్కడకువెళ్ళి తమశాఖను నెలకొల్పారట. ఆప్రాంతం యువకులు కొందర్ని చేర్చుకుని ప్రతిదినం పెరేడ్, డ్రిల్లు చేయిస్తున్నారట. ఇది మార్క్సిస్టులకు కోపం తెప్పించినట్లుంది. వారుకూడా పనిగట్టుకుని ఆర్ ఎస్ ఎస్ పెరేడ్ ప్రక్కనే, అదేసమయంలో ప్రతిదినం తమ కార్యకర్తలచేత కబాడి ఆడించడం మొదలు పెట్టారట. పెరేడ్ సమయంలో ఒకరికి వ్యతిరేకంగామరొకరునినాదాలుచేయడం, కవ్వించుకోవడం జరుగుతుండేదట. 14 తేది ఉదయం ఈకవ్వింపు శృతిమించి, మార్క్సిస్టులు దాదాపు50మంది కలసి ఆర్.ఎస్.ఎస్ వారిపై దాడిచేసి చితకదన్నారట.

అప్పటినుంచి మొదలైంది ఉద్రిక్తత. ఈ సంఘటన జరిగిన వెంటనే ఎస్. పి. శ్రీ ఆర్ ఆర్ గిరీశ్‌కుమార్ ఇరుపక్షాల నాయకులనూ సంప్రదింపులకు పిలిచి, శాంతి ప్రయత్నాలు చేశారు; సి పి ఎం అని అనుమానంకల్గిన నలుగురైదుగురిని 15తేదిఉదయం ఆర్ఎస్ఎస్‌చితకబాదించిందట; వారి ఇళ్ళపైబడి ఆడవారిని కూడా బెదిరించివచ్చారట. 16 తేది ఉదయంవరకు చెదురు మదురుగా ఈ దాడులు కొనసాగినట్లున్నాయి.

తిరిగి ఈరోజు (22 తేది) వరకు ఎటువంటి సంఘటనలు జరుగలేదుకాని, జరుగుతాయేమోనసే సందేహంతో టౌనంతా పకడ్బందీగా పోలీసు బందోబస్తు ఏర్పాటుచేశారు. ప్రతివీధి మొగుదాలలో శిరస్త్రాణాలు ధరించి, లాఠీలుచేతపట్టిన పోలీసులను నిలబెట్టారు. రాత్రీ పగలు వైర్‌లెస్ సెట్లతో పోలీసు వాహనాలు గస్తీతిరుగుతున్నాయి. ముందు జాగ్రత్తచర్యగా మంగళగిరినుంచి ఒక ప్రత్యేక బెటాలియన్ తెప్పించారు. ఎస్. పి. గారు రాత్రీ పగలు నిద్రలేకుండా ఏర్పాట్లు పర్యవేక్షిస్తున్నారు. గుంటూరు రేంజి డి. ఐ. జి. శ్రీ సుకుమార కూడా నెల్లూరు వచ్చారు. ఎటువంటి పరిస్థితి ఎదురైనా, ఎదుర్కోడానికి తాము సన్నద్ధంగావున్నామని, అయితే ఉభయ పార్టీలూ హింసాకాండకు తలపడకుండా వుండాలని ఎస్. పి. గారు విజ్ఞప్తిచేశారు.

అయితే ఈ శాంతి వచనాలు ఉభయ నాయకుల చెవికెక్కుతున్నాయా అంటే, సందేహమే. ఇద్దరూ విడివిడిగా చేసిన చేస్తున్న ప్రకటనలతోకూడా ఉద్రేకం స్పష్టంగా కన్పిస్తూంది. పోలీసులు తమకు రక్షణ కల్పించడంలో విఫలమైనారని ఇద్దరూ విమర్శించారు. తమంతట తాము ఎటువంటి దాడులకూ పాల్పడమని, అయితే ఎదుటివారు తమపైకివస్తేనహించమని ఇద్దరూ చెప్తున్నారు. జక్కా వెంకయ్య గారైతే, ఆర్. ఎస్. ఎస్. కు తగిన

—కొరవ 12వ పేజీలో

# జిల్లాలో ఏటా 50 కోట్లు ఎంచి ఏట్లో పోస్తున్నారు!

జిల్లాలో అభివృద్ధి కార్యక్రమాలపైన ఏటా 50 కోట్ల రూపాయలు వ్యయం చేస్తున్నారంటే నమ్మగలమా? కానీ ప్రణాళికా మండలి అజెండా, రెవిన్యూ మంత్రి స్వాతంత్ర్య దినోత్సవ ప్రసంగాల లోని అంకెలు చూస్తుంటే ఈ సంఖ్యకు మించి లెక్కతేల్తుంది, వస్తుం మొత్తం.

ఈ సంవత్సరం లెక్కలే చూస్తే కరువుకు రెండు కోట్లు వచ్చాయి; తుఫానుకు 3 కోట్ల 57 లక్షలు ఇచ్చింది ప్రభుత్వం. గ్రామీణ గ్రాంట్ల పథకం క్రింద 8 కోట్ల 37 లక్షలు ప్రభుత్వ వాటా క్రిందనే ఖర్చుచేస్తారట. కేంద్ర ప్రభుత్వ పథకాలైన ఎన్. ఆర్. ఇ. పి, ఆర్. ఎల్. ఇ. జి. పి. లకు 2 కోట్లు కేటాయింపబడ్డాయి. ఇవన్నీ కలిపితే 17 కోట్లవుతుంది.

ఇవికాక ఉభయ ప్రభుత్వాలనుంచి సాధారణంగా వచ్చే నిధులు చాలా వున్నాయి. ఒక్క ప్రావిన్షియల్ బ్యాకె ఫిన్నింగ్ స్కీముకే కోటిరూపాయలు వస్తున్నాయి. అడవుల అభివృద్ధి, పిడబ్ల్యుడి నిర్వహణ పథకాలు, డి ఆర్ డి ఎ సబ్సిడీలు, పెద్ద్యాలు పులాలవంటి సంస్థల కార్యక్రమాలు, సాంఘిక సంక్షేమ శాఖల్లో వ్యయమయ్యే మొత్తం, జిల్లా పరిషత్, పంచాయతీ సమితులు, మునిసిపాలిటీల సాధారణ నిధులు.. ఇటువంటి వన్నీ కలిపితే జిల్లా అభివృద్ధికి కాని, సంక్షేమానికి కాని, ప్రతి సంవత్సరం 50 కోట్లు ఖర్చవుతున్నాయన్నా ఆశ్చర్యం లేదు. ఉద్యోగుల జీతభత్యాలు కాకుండా కేవలం పథకాల అమలుకే ఈ మొత్తం వ్యయమౌతుంది.

ఇంత భారీమొత్తాలు ఖర్చవుతున్నాయంటే, అభివృద్ధి కూడా భారీగానే వుండాలి. కాని వుందా? మన గ్రామసీమలు నిజంగానే ఈ కోట్లాది ద్రవ్యంతో పురోగతిని సాధించగలుగుతున్నాయా? గ్రామీణ పేద ప్రజానీకం జీవితంలో పథకాలవల్ల ఎంత మేర మార్పులు సంభవిస్తున్నాయి? వంటి అంశాలపై ఎవరైనా పరిశోధక విద్యార్థి అధ్యయనం జరిపితే, ఎంతో బాగుంటుంది.

> **పల్లెల పురోగతికి ప్రభుత్వం చేపడుతున్న ప్రగతి పథకాలు ఎంతవరకు ఫలిస్తున్నాయో పరిశీలన జరపడం అవసరం**

నిశితంగా, లోతుగా పరిశీలిస్తే ఎటువంటి వాస్తవాలు వెల్లడౌతాయో తెలియదుగాని, కళ్ళ ఎదుట కన్పిస్తున్నంతవరకు గమనించిచూస్తే, ఈ కోట్లన్నీ ఎంచి ఏట్లో పోస్తున్నారా అన్న సందేహం కల్గుతుంది. ఆధారంలేని సందేహం కాదిది; అనుభవంతో తెలుసుకున్న వాస్తవం.

1979 తుఫాను సందర్భంలో అప్పటి రెవిన్యూ మంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి కోట్లకు కోట్ల నిధులు తెచ్చి, జిల్లాలో కుమ్మరించారు. ఒక్క పిడబ్ల్యుడిలోనే ఆ రెండేళ్ళలో 10 కోట్లకు పైగా ఖర్చుచేశారు. వాటిలో సగం డబ్బు సక్రమంగా వినియోగమైవుండినా, మరొక నాలుగు తుఫాన్లనుకూడా జిల్లాలోని చెరువులు, కాల్వలు తట్టుకొని వుండేవి. కానీ జరిగిందేమిటి? 80 లో తుఫానువస్తే, 79 లో రిపేరుచేసిన చెరువు ఒక్కటి కూడా గండిపడకుండా తప్పించుకోలేకపోయింది.

ఇప్పుడుకూడా పరిస్థితి అంతకంటే భిన్నంగా ఏమీలేదు. కరువు నిధుల సంగతే చూడండి. నిరుడు ఈ పద్దుక్రింద దాదాపు రెండుకోట్లకుపైగా వ్యయంచేశారు. వందలాది బోర్లువేశారు. ఆ కోట్లన్నీ ఏమైపోయాయోగాని, మళ్ళీ ఎండాకాలం వచ్చేసరికి అన్ని తాలూకాలలో మంచి నీటి కరువు ప్రత్యక్షమైంది. లక్షలు ఖర్చుపెట్టి వేస్తున్నరోడ్ల పరిస్థితికూడా అంతే.

ఈ ఖర్చుల్లో కొద్దోగొప్పో కళ్ళకు కన్పడుతున్న అభివృద్ధి ఏదైనావుంది అంటే, అది కేవలం భవనాలే! ఉరిసినా ఉరిసినా జిల్లాలోని వందలాది స్కూళ్ళకు గ్రామాలలోని పంచాయతీలు, సొసైటీ వంటివాటికి స్వంతభవనాలు ఏర్పడుతున్నాయి. అవి శాశ్వతంగా నిలుస్తాయా అంటే-అది కాంట్రాక్టర్ దయపైన ఆధారపడివుంటుంది.

-కొరవ 10వ పేజీలో

## స్వాతంత్ర్యం వచ్చేసింది!

అయ్యా-

స్వాతంత్ర్యం రాలేదంటే
మీకొప్పుకోరని మాకు తెలుసు
ఇటు చూడండి,
మేం బురదగుంటల్లో
పందుల్లా ఎలా బ్రతుకుతున్నామో!
పందిట్లో సమారాధన
కుక్కలుకూడా మాతో తింటున్నాయి
విసిరేసిన ఎంగిలాకుల్లాక్కొని.
పరవాలేదు
ఎలాగో ఒకలాగ కడుపునిండితేచాలు
అనుకునేవాళ్ళె మావాళ్ళంతా
ఇలాగే 39 ఏళ్ళు గడిచింది
ఇంక మావల్లకాదుబాబోయ్.
ఊరి పెద్దలు నిప్పంటిస్తారు
పూరిగుడిసెలేకదాని,
కులంగలోళ్ళు నమ్మిచేస్తారు
పైకివచ్చేస్తామేమోనని
మమ్మల్ని
ఇలా బతకనివ్వండి
స్వాతంత్ర్యం వచ్చేసిందని
ఒప్పేసుకుంటాం!

-సూడభూమి. సంపత్‌కుమార్.

## పినాకిని తీరం

### చంద్రశేఖరరెడ్డికి మళ్ళీ జి. ప. ఆశ?

నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారికి జిల్లా పరిషత్తు ఛైర్మన్ పదవిమీద మళ్ళీ ఆశ కొటకలాడుతున్నదా? ఒకసారి రుచి మరిగినవారు మరలా వదలిపెడతారా? వేమనకాలంలో పదవుల పోట్లాటలు లేవు కాబోలు కాని. వుండివుంటే బ్రహ్మాండమైన ఎత్తు దిమ్మతెగులు జాబితాలో పదవీ వ్యామోహాన్నిగూడా చేర్చివుండేవాడు! రాజకీయవాదికి రిటైర్‌మెంటు రెండు సందర్భాలలోనే సాధ్యం; ఏవిధంగానైనా అవకాశం శాశ్వతంగా దూరం కావడం, మరణం- ఇవి రెండే రాజకీయవాదికి విశ్రాంతి జీవితాన్ని ప్రసాదిస్తాయి!

ఎం. సి. ఈమధ్య ఎవరితోనో చెలి ఇదాప్తని కర్ణాకర్ణిగా వినబడింది-నా కతబలికోర్కె; ఈసారి జి. ప. ఛైర్మన్ కావాలనివుంది అన్నారట. ఎం. సి. ఇటువంటి కోర్కెను వెలిబుచ్చివుంటారు అనుకోడానికి వీలులేదు. గతపర్యాయం తమ్ముడు శ్రీనివాసులురెడ్డిగారే అన్నగారిపక్షంగా అందరినీ చాలముందుగా కలసుకొని విజ్ఞప్తిచేశారు. చంద్రశేఖరరెడ్డి అభ్యర్థిత్వాన్ని బలపరచవలసిందని ఆయన కోరాడు. అప్పుడు అన్నదమ్ములిద్దరూ కాంగ్రెస్‌లోనే వున్నారు. జనార్దనరెడ్డి వ్యతిరేకవర్గం అంటూ ఒకటి వుంటుంది, అది సహజంగా శ్రీనివాసులురెడ్డిగారికి అనుకూలంగా వుండివుండాలి. ఎప్పుడైతే శ్రీనివాసులురెడ్డి వారెవరితోనూ ప్రస్తావించకుండా, సంప్రదించకుండా జి. ప. ఛైర్మన్ పదవికి అన్నగారికి ప్రచారం ప్రారంభించాడో, అప్పుడే వారందరూ అసంతృప్తి చెందిపోయారు. జనార్దనరెడ్డి అభ్యర్థి అయినా ఓరేపల్లికి అందరి సపోర్టు లభించడానికి దోహదమిచ్చిన కారణాల్లో అదొక ముఖ్య కారణం. తనవారి అసంతృప్తికి గురియై అన్నకు ప్రచారం ప్రారంభించినా శ్రీనివాసులురెడ్డికి ఫలితం దక్కలేదు. అది రిజర్వుడుసీటై వారి ఆశలను అడియాసలు చేసింది!

ఇప్పుడు మన జిల్లా ప్రజాపరిషత్తు రిజర్వుడా, జనరలా అనేది తెలియదు. రాష్ట్రానికంతా కలిపి మూడు జి. ప్ర. ప. లు రిజర్వుడు అన్నారు. వాటిని హరిజన, గిరిజన జనాభా ననుసరించి చేస్తారో, లేక తమపార్టీ గెలువలేదనుకున్న జిల్లాలను చేస్తారో రామారావుగారికే తెలియాలి! మండల ఎన్నికలకు గాని, జి. ప్ర. ప. ఛైర్మన్ ఎన్నికలకు గాని తేదీలు సహా నిర్ణయించాలేదు. ఇటువంటి సమయంలో చంద్రశేఖరరెడ్డి తాను జి. ప్ర. ప. ఛైర్మన్ కావదల్చుకున్నానన్నాడంటే నెల్లూరు జిల్లా ప్రజాపరిషత్తు జనరల్ అవుతుందని, ఎన్నికలుకూడా త్వరలోనే జరగవచ్చుననే సమాచారం ఎం. సి. కి తెలిసి వుంటుందనుకోవాలి. ఆ తెలియడం శ్రీనివాసులురెడ్డిగారిద్వారా తెలిసివుండినా ఆశ్చర్యంలేదు. జి. ప్ర. ప. ఛైర్మన్ పదవికి ఎం. సి. మళ్ళీ పోటీచేయాలనుకోవడం తప్పనేది నా అభిప్రాయంకాదు. ఆయన ధైర్యం ఎన్టీఆర్ గ్లామర్‌తో చిల్లిగవ్వ ఖర్చుపెట్టకుండా జి. ప్ర. ప. ఛైర్మన్నై మరొకసారి చక్రం తిప్పవచ్చుననేదిగా వుంటుంది. డబ్బు ఖర్చుచేయవలసివస్తే మాత్రం పోటీకి ఆయన సాహసించరనుకుంటాను. ఏమైనా ఎం. సి. పోటీ కాంగ్రెస్‌కు మంచిదేమో?

అధికారాలులేని ఈ ఛైర్మన్ ప్రత్యక్ష ఎన్నికను పార్టీలకతీతంగా అందరూ బహిష్కరించగలిగితే ఎట్లా వుంటుంది? కాని అది జరిగేపని కాదనుకోండి!

### రథయాత్ర కొనసాగుతూనేవుంది!

జనార్దన రథం కదలిందని నాలుగు వారాల క్రితం ఒకవార్త ప్రకటించాము. అప్పుడు ప్రారంభమైన రథయాత్ర కొనసాగుతూనే వుంది; అది జిల్లా అంతా చుట్టిందాకా కొనసాగేట్లుంది.

ఈ శీర్షికలోనే నేను ఒకటి రెండుసార్లు ప్రస్తావించాను. పంచాయతీ రాజ్యాలకు, సహకార సామ్రాజ్యాలకు ఎన్నికలు జరగబోతున్నాయి. వాటిని హస్తగతం చేసుకోడానికి తెలుగుదేశం ప్రభుత్వ పరంగా పార్టీ పరంగా కట్టుదిట్టమైన చర్యలన్నీ తీసుకొంటున్నది. ముఖ్యమంత్రి రామారావుగారు ప్రతి ఎన్నికకు వేషంమార్చే సాంప్రదాయం ప్రకారం తలపాగాతో హెలికాప్టరారూఢులై మెరుపు పర్యటన జరిపిపోయారుగూడా! కాని కాంగ్రెస్ సంస్థలు ఏమి చేస్తున్నాయి? కాంగ్రెస్ నాయకులు ఏమి చేస్తున్నారు? నెల్లూరు జిల్లా వరకు ఎవరి పేరంటున్నా లేకున్నా ఒక బాధ్యతగల కాంగ్రెస్ నాయకుడుగా జనార్దనరెడ్డి కాంగ్రెస్ వాదులను సంఘటిత పరచి ప్రజలతో ప్రత్యక్ష సంబంధాన్ని పునరుద్ధరించుకొంటున్నాడు. ఆయన పర్యటనల ప్రత్యేకం అదిగానే వుంటుంది. మొన్న స్వాతంత్ర్య దినోత్సవం వస్తే ఆయన సూళ్ళూరుపేట మొదలు నెల్లూరు వరకు కలకవేశాడు. మరురోజు వెంకటగిరి తాలూ

—కొరవ 10వ పేజీలో

# జమీన్ రైతు

## ప్రళయ గోదావరి

ఉప్పొంగిపోయింది గోదావరి! ఉర్వి ఉరముపైకి ఉరి కురికివచ్చి, విషపు నురగలు విసిరిసిరికొట్టి, పెనుసుడులు తిరిగి, హోరున మ్రోతలు పెట్టి, కడలిలో లీనమైంది గోదావరి.

ఏ తెలుగు మాగాణాన్ని రమణీయ కేదారంగా, అన్న పూర్ణగా తీర్చిదిద్దిందో, అదే తెలుగు ముంగిట ప్రళయకాల కరాళ నృత్యంచేసింది; ఏ ఆంధ్రదేశంలో మాతృమూర్తిగా ఆరాధన లందు కున్నదో, అదే ఆంధ్రులనోట చావుకేకలు సృష్టించి చిందులేసింది; ఏ జలధులతో తాను తెలుగు రైతన్న లోగిళ్ళలో సిరులు పొంగించిందో, ఆ ముంగిళ్ళలోనే మూగజీవులకు జలసమాధి కట్టింది; కట్టలుతెంచుక ప్రవహించింది; ఆనకట్టలపై ఆగ్రహించి విరుచుకుపడింది; ప్రచండ వేగంతో పుడమినే చుట్టుముట్టేసింది; ఉత్తుంగ తరంగాలతో ఊపిపారేసింది; ఆంధ్రుల అన్నబొక్కసాన్ని ఆబగా ఆరగించింది; ఆంధ్ర కర్షకలోకం ఆశలన్నీ త్రుంచివేసింది.

కన్నతల్లిలాంటి గోదావరే కాలసర్పంలా కస్సున కాటేస్తే ఏమిజరుగుతుంది? ఊళ్ళకు ఊళ్లే కొట్టుకపోయాయి; పండిన పంట లన్నీ తుడిచిపెట్టుకుని పోయాయి; లక్షలాది కొంపలు నిలువునా కూలిపోయాయి; లక్షలకు లక్షల ఆస్తులు నీళ్ళపాలైనాయి; వందలాది నిండుప్రాణాలు నీల్గాయి; వేలాది మూగపశువులు మృత్యువాత పడ్డాయి!

ఆగస్టు 14 నుంచి మదించిన మదపుటేనుగులా విరుచుకునిపడిన గోదావరి వరదలకు ఉత్తరాంధ్ర చితికి, చివికి, జీర్ణమైపోయింది. నూరేళ్ళ ఇవతల ఇంత ఉధృతమైన వరద తెరుగము మనం; ఆ ఐదురోజులపాటు గోదావరిలో పారింది కొండలనుండి జాలువారిన నీళ్ళుకాదు- రైతుల వెచ్చటి కన్నీటి వెల్లువలు; ప్రమాదం ముందుగానే పసిగట్టగల్గిన సాధనసంపత్తి పుణ్యాన మనుషుల ప్రాణాలు చాలావరకు కాపాడుకోగల్గారు కాని, బంగారువంటి గ్రామీణ ఆర్థికవ్యవస్థను ప్రజలు, ప్రభుత్వాలు నిస్సహాయంగా కడలికి ధారపోశారు.

దివిసీమ ఉప్పెన పదివేల ప్రాణాలుతీసినా, పట్టుదలతో కోలుకోగల్గాం; 79 తుఫాను నెల్లూరుజిల్లాను అతలాకుతలం చేస్తే నిలదొక్కుకోగల్గాం; కానీ ఈ ఉపద్రవంనుంచి ఇప్పుడప్పుడే తేరుకోవడం దుస్సాధ్యం. దాదాపు రెండువందల మైళ్ళపర్యంతం, ఐదు జిల్లాలను కల్లోలపరిచాయి ఈ వరదలు.

ఇతర నదుల వరదలకు, గోదావరికి తేడావుంది. నూటికి 75 శాతం సముద్రంలో కలిసే ప్రవాహం దానిది; దాని ఉరవడిని ఆపను చాలినన్ని ఆనకట్టలు లేవు. అందుకే ఇది కళ్ళాలు తెగిన గుర్రంలాగా గంతులేసింది. వరదల ఉధృతికి ఉభయ గోదావరి జిల్లాలలో కాలువల వ్యవస్థ ఛిన్నాభిన్నమైపోయింది. దాన్ని పునరుద్ధరించుకోవడం మాటల్లో అయ్యేపనికాదు. కోట్లు కావాలి; పునరుద్ధరించకుంటే ఆంధ్రదేశానికి అన్నపూర్ణ అనే ప్రశస్తి అంతరించిపోతుంది. సిరిగల మారాజులుగా పేరుపడిన గోదావరిజిల్లాల రైతులుసైతం చివికి,చితికి, చతికిలపడ్డారు. వారి పంటలేకాదు, ఇళ్లు ఊళ్లు, పశుసంపద, ఆస్తిపాస్తులు అన్నీ హరించుకునిపోయాయి. వారు తిరిగి కోలుకొనడానికి ఎన్నిదశాబ్దాలు పడ్తుందో చెప్పలేము. వారిదుస్థితి వింటే గుండె ద్రవించిపోతూంది!

కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు రెండూ పరిస్థితి తీవ్రతను బాగా అర్థంచేసుకున్నట్లే కన్పడుతున్నాయి సత్వర సహాయ కార్యక్రమాలు చేపట్టడంలో ప్రశంసనీయమైన కృషిసల్పాయి రాజీవ్‌గాంధీయే స్వయంగావచ్చి, అడిగిన వరమెల్లా ఇచ్చిపోయారు. అయితే తాత్కాలిక ఉపశమన చర్యలతో సరిపెట్టుకుంటే చాలదు. చెదరిపోయిన రైతాంగ ఆర్థికవ్యవస్థకు తిరిగి పునరుజ్జీవనం కల్పించడానికి శాశ్వత చర్యలు తీసుకోవాలి; ఛిన్నాభిన్నమైన నీటిపారుదల కాల్వలు, చెరువులు, ఆనకట్టలను త్వరిగతిన పునరుద్ధరించాలి; వృధాగా కడలి పాలౌతున్న గోదావరి జలాలను పంటపొలాల్లోకి మళ్లించడమే కాకుండా, వరదబీభత్సాలను భవిష్యత్తులో నివారించగల్గిన పోలవరంవంటి భారీ ప్రాజెక్టులు చేపట్టాలి.

## జమీన్ రైతు

21.8.1936

చెల్లించిన బాకీకి తిరుగా యాలం

వెంగలవస్నూరులో భ టు వృ త్తి యినాం 21 నెంబరుకు పర్వేగాళ్ళ క్రయానికి రు 530/21 డిక్రీకాబడినది.

సదరు డిక్రీ మొత్తములను ఖర్చులతోసహా 11-1-1934 తేదిన వేణుంబాక రివిన్యూ యిన్‌స్పెక్టరు గారైన వెంకటేశయ్య గారివద్ద రు 6-12-0 లు చెల్లించి రశీదు పొందారు.

తిరుగా అదేమొత్తానికి భూమి యాలం 24-8-36 తేది జరుపబడునని 17-7-36 తేదితో యాలం ఇస్తిహారుపుట్టబడి రైతులకుపోస్టులో 10-8-36 తేదిన జారీకాబడినది.

ఈ ఎస్టేటు పాలన 'లంజబిడ్డకు తండ్రిఎవరు' అన్నట్టుంది.

దీనికి ఎవరుకర్త?

వెంకటగిరి మేకలగొడవ

తీర్వంపాటివారు మేకలపుల్లరి మనియార్డరుచేసి ఆర్డీ పంపుకున్నతర్వాత ఫారెస్టువారు ఆ గ్రామానికివచ్చి మనియార్డరు చేసిన మొత్తము 1346 ఫసలీకి చెల్లు వేసుకొని రోడ్డుకు తూర్పుకు పరిమెంటు యిస్తాము. ఇష్టపడకుంటే కేసులు పడతాయని బెదిరించారట. తరాక్త పోలీసువారు సబ్‌మేజిస్ట్రేటువారు గ్రామానికివచ్చి రైతులను బెదిరించి రాజాగారు చెప్పినట్లు పొమ్మని చెప్పిరట. రాజాగారు చెప్పినట్లు పరిమిటు తీసుకొంటే మేకలు క్షేమముగాకోవలసిందే. అమ్ముకుంటే జీవించలేము. అనాదిప్రకారం పరిమెంటు యిప్పించమని చెప్పుకొనిరట. వినకుంటే వృధాగా కేసులు పెడతారని బెదిరించి పోయినారట.

నెల్లూరు ముచ్చట్లు

గోవిందయ్య ఉదయగిరి తాలూకంతా ఎలెక్షన్ ఢంకా బజాయిస్తుంటే

### 50 ఏళ్ల క్రితం ఈవారం

వరదన్న గోవిందయ్యను రాకుండా చేయడానికి యంత్రాంగం పన్నుతున్నాడని రహస్యవేదులంటారు. గోవిందయ్య వస్తే రేపు అడ్డేగా? అందువల్ల యిలాంటి పరస్పర సహాయాలు చేసుకోవడం అవసరమే. ఒక పార్టీవారు కాబట్టి.

• • •

జిల్లాబోర్డు విభజన జరగదంటున్నారు అంతర్యాలు అలాఅయితే కోటపాడు మాలెకొండారెడ్డి, నాయుడు గారలు చేసుకొన్న రాజీపరత్తులు భగ్నమైనట్లేనా? పాపం!!

• • •

విభజన లేకపోతే జిల్లాబోర్డు శక్తివేమూ ఉంటోనుందన్నమాట జస్టిసు పార్టీవారి యుద్ధనన్నాహాలంతా 24 తేది నిర్ణయమౌతాయి. కాంగ్రెసు వారిది?

• • •

ఊళ్లపాలెం వృత్తిపన్ను ఒట్టు 1365 మినిస్టరు కుమారస్వామిగారు ఉద్ధరించారట. జస్టిసు మురుక్కాలువలో యిలాంటి క్రిములెన్నో?

• • •

గత 15 తేది తాలూకాఫీసులో జరిగింది ఇర్రిగేషన్ కాన్ఫరెన్సు, చేపలనంతాఅని అనుమానంవేస్తూంది ఛీ ఛీ ఛీ!! ఇది కూడ ఒక కాన్ఫరెన్సేనా? ఆత్మగౌరవం గుర్తించని మనవారికి లోటుబాటేమిటో తెలిస్తేగా?

గోవిందరెడ్డిగారు సపత్నీకంగా 20 తేది సాయంకాలం అల్లూరులో ఉడ్‌హౌస్ దొర, దొరసానిగార్లతో టీ తాగినారట. విద్యావతియగు పత్నితో విహరించు లచ్చయ్యను ఆక్షేపించు ఛాందసులకు గోవిందయ్య సంస్కారం అనాక్షేపంగా వుంటుందా? ఓయ్ మందభాగ్యుడా! ఆ ఫలపుష్ప శోభిత వికాసం బుకుధర్మమోయి!

• • •

గోవిందరెడ్డిగారు అల్లూరులో అసాధ్యపు పోటీయని కోవూరు సర్కిలుకు వస్తారంటారే? వారిపాటి సేవ జేసేవారు యీ సర్కిల్లో లేరనేనా?

# అధికార దాహానికి చెరకు ఫ్యాక్టరీని బలిచేయవద్దండీ!

కోవూరు చక్కెరఫ్యాక్టరీ అభివృద్ధి పేరుతో అధికార దుర్వినియోగంచేసి వెళ్లిపోయారు! మేనేజింగ్ డైరెక్టర్ శ్రీమానే! రైతుల అదృష్టవశాత్తు, జాయింట్ కలెక్టర్ శ్రీ దయాదారి ఇన్‌ఛార్జిగా వచ్చి, మూడు నెలల్లో ఫ్యాక్టరీని దారిలో పెట్టారు. కొన్ని లక్షల రూపాయల దుర్వినియోగాన్ని అదుపులో పెట్టగల్గారు. నిర్వాధ్యంగా తినగుతుండిన సిబ్బందికి ముక్కుత్రాడు తగిలించారు. ఆయనే ఇంకొక సంవత్సరం కొనసాగివుంటే, ఫ్యాక్టరీ సమస్యలు చాలావరకు తీరివుండేవి రైతుల దురదృష్టం- ఆయన తప్పుకున్నారు.

ఇప్పుడి ముళ్ళకిరీటం రైతుల నెత్తిన పెడ్తారట అన్నగారు. ఒకచిన్న గ్రామ పంచాయితీనే సక్రమంగా నిర్వహించలేని రైతులు ఇంతపెద్ద సంస్థ నిర్వహించగలరా? కోట్ల పెట్టుబడితో నెలకొల్పిన ఫ్యాక్టరీలను శాస్త్రీయ విధానాలు తెలిసి, ప్రొఫెషనల్ యాజమాన్య సూత్రాలు అధ్యయనం చేసిన వ్యక్తులు నిర్వహిస్తేనే అన్నీ సక్రమంగావుంటాయి. ఫ్యాక్టరీలో ఏ విషయంతో పరిచయం, అనుభవంలేని రైతులకు ఆ బాధ్యత అప్పచెప్తే మంచి జరుగుతుందా?

పదుచుపిల్లను చూచి ఉవ్విళ్లూరే ముసలి తండ్రులు చాలామంది పెద్దలు. ఫ్యాక్టరీ యాజమాన్యానికై తహతహలాడుతున్నారు. వ్యవసాయాన్నే నమ్ముకుని మునిగిపోతున్న రైతులకు చక్కెర ఫ్యాక్టరీ ఒక అనరాగావచ్చింది. దానిపై ఎందరో రైతులు ఎన్నో ఆశలు పెంచుకుని వున్నారు. అధికారం కోసం వెంపర్లాడే పెద్దలు తమ స్వార్థంకోసం, ముఠా కొట్లాటలతో ఫ్యాక్టరీని, తద్వారా రైతుల బ్రతుకును బుగ్గి చేయవద్దని మనవి రాజకీయాలకు అతీతంగా, రైతాంగం శ్రేయస్సుకోసం పాటుపడాలనుకుంటే ముందుకురండి, మా కభ్యంతరం లేదు. కాని, అధికార వ్యామోహం తప్ప మరే వ్యాపకం ఆలోచనలేని పెద్దలు దూరంగా




తొలగిపోండి! చెరకు రైతులారా రేపు జరుగనున్న ఎన్నికలలో మనకు మంచి చేసే వారెవరన్న విచక్షణ తప్పు. రాజకీయ పరంగా ఆలోచించి ఓటు చేయవద్దు; చేస్తే, మన సమాధి మనమే త్రవ్వకున్నవారమౌతాం.

చెర్లోపాలెం —వి. నిరంజన్ ఎం. ఎ.

### జాతికంటే మతం గొప్పదా?

మతాచారాలకు, మత విశ్వాసాలకు జాతీయగీతాలాపన అభ్యంతరకరంగా వుందని, అందువల్ల దాన్ని మేముపాడలేమని కేరళకుచెందిన విద్యార్థులు ముగ్గురు సుప్రీంకోర్టుకు ఆశ్రయిస్తే, న్యాయమూర్తులు వారినిసమర్థిస్తూ తీర్పునివ్వడం చాలా వింతగా కన్పిస్తూంది. ఇదే అంశంపై వీరిని వారి స్కూలు యాజమాన్యం సస్పెండ్‌చేసింది; ఆ సస్పెన్షను కేరళ హైకోర్టు ధృవీకరించింది కానీ సుప్రీంకోర్టు మాత్రం వారిని సమర్థించింది. రాజ్యాంగంలోని 19(1)(ఎ) 25 (1) అధికరణలక్రింద తమ మతాచారాలు అమలుచేసుకోవడానికి హక్కు వుందని ఏరు వాదించారు!

అయితే అదే రాజ్యాంగంలో 51 (ఎ) అధికరణ ప్రకారం జాతీయ

—కొరవ 10వ పేజీలో

# "మహారాష్ట్ర ప్రజల జీవన విధానమే సహకారం!"

[మహారాష్ట్రలో చక్కెర పరిశ్రమ స్థితిగతులను అధ్యయనం చేయడానికి నెల్లూరు నుంచి వెళ్ళిన రైతుల బృందం అనుభవాలను శ్రీ సామంతు సుబ్బారెడ్డి రెండు వారాల క్రితం కొద్దిగా వివరించారు. తదుపరి భాగం ఇప్పుడు ప్రచురిస్తున్నాం.

సం॥]

4 తేది నాసిక్ జిల్లాలోని ఫ్యాక్టరీలను సందర్శించిన తర్వాత, 5 తేది ఉదయం గోదావరి నది జన్మస్థలమైన త్రియంబకం చేరాం. అక్కడ పుణ్య స్నానంచేసి, పూనాకు తరలింది మా బృందం. ఆరాత్రి విరామం తర్వాత 6 తేది ఉదయం తలగాన్ నేషనల్ హెవీ ఇంజనీరింగ్ కంపెనీ వర్క్‌షాపు సందర్శించాం.

దేశంలోని చక్కెర ఫ్యాక్టరీలన్నింటికీ అవసరమైన యంత్ర సామగ్రి సరఫరా అయ్యేది ఇక్కడనుంచే! ఇంత బృహత్తర కర్మాగారంకూడా సహకార రంగంలో, అత్యంత సమర్థవంతంగా నిర్వహింపబడుతుండడం విశేషం. వెల్డింగ్‌లో చిన్న తప్పుదొర్లినా ఎత్తిచూపగలిగే అధునాతన కంప్యూటర్‌లు ఇందులో అమర్చివున్నారు.

సాయంత్రం 4 గంటలకు మంజిరలోని దక్కన్ షుగర్ ఇన్‌స్టిట్యూట్ సందర్శించాం. ఆసియా ఖండంలోనే ఇటువంటి పరిశోధనాలయాలలో ఇది మొదటిది. మహారాష్ట్ర మాజీముఖ్యమంత్రి శ్రీ వసంతదాదా పాటిల్ దీనిస్థాపకులు. చెరకు ఉత్పత్తి, చక్కెరపరిశ్రమలకు సంబంధించిన అంశాలపై అత్యంత అధునాతన శాస్త్రీయ విధానాలలో పరిశోధనలు జరుగుతున్నాయి. పరిశోధనా

> **చెరకు రైతుల విజ్ఞానయాత్ర విశేషాలు**
>
> ★
>
> శ్రీ సామంతు సుబ్బారెడ్డి

ఫలితాలను ఎప్పటికప్పుడు రైతులకు, ఫ్యాక్టరీలకు అందిస్తున్నారు షుగర్ టెక్నాలజీలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు కూడావుంది. ఇతరదేశాలనుంచి ఇక్కడ విద్యార్థులు వచ్చిచేరుతున్నారు.

ఈ ఇన్‌స్టిట్యూట్ ఆవరణంలోనే రైతు ప్రతినిధులందరితో ఒక పెద్ద సమావేశం ఏర్పాటుచేశారు ఇన్‌స్టిట్యూట్ ప్రొఫెసర్, శ్రీ హస్సే చాలా ఆసక్తిదాయకమైన ప్రసంగం చేశారు.

'మహారాష్ట్ర ప్రజల జీవన విధానమే సహకారం' అన్నారాయన. మహారాష్ట్ర చక్కెర రంగంలో రైతు కీలకమైనవ్యక్తి మంచిచెరకు పండించడమే కాదు, ఫ్యాక్టరీ నిబంధనలు తుచ తప్పకుండా పాటించడంకూడా రైతు కర్తవ్యం. అట్లే ఫ్యాక్టరీలో పనిచేసే ప్రతిఉద్యోగి, ప్రతి అధికారీ తాము రైతు శ్రమతో, రైతు సొమ్ముతో జీవిస్తున్నామన్న భావనను సదా జ్ఞప్తిలో వుంచుతుంటారు. వారికి నిజమైన యజమాని రైతే! చీఫ్ అగ్రికల్చరల్ ఆఫీసర్లద్వారా ఎప్పటికప్పుడు చెరకు నాణ్యత, దిగుబడుల పెంపుకు కృషిజరుగుతూనే వుంటుంది. ఈ కృషి సత్ఫలితాలను ఇస్తూందికూడా!

రైతులు, ఫ్యాక్టరీ అధికారులు, బ్యాంకుల మధ్య పూర్తి సమన్వయం వుంది ప్రభుత్వంకూడా ఫ్యాక్టరీలో ఏదైనా పెద్ద లోటుపాట్లు బయటపడినప్పుడు మాత్రమే జోక్యం చేసుకుంటుంది; లేకుంటే వారి ప్రస్తావనే పట్టించుకోదు ఈ పరస్పర సహకార, సమన్వయంవల్లే ఫ్యాక్టరీలు ఇంత విజయవంతమౌతున్నాయి. మరీ విశేషమేమిటంటే కొన్ని ఫ్యాక్టరీలలో 20 సంవత్సరాలనుంచి ఎన్నికలు ఏకగ్రీవంగా జరుగుతున్నాయి.

ఈ ఆసక్తికరమైన అంశాలన్నీ ప్రొఫెసర్ హస్సే ఉపన్యాసంలో వెల్లడైనాయి. పూనానుంచి 8 తేది ఉదయం హైదరాబాదు తిరిగివచ్చాము. రాగానే ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు చెరకురైతుల సదస్సు ఒకటి ఏర్పాటు చేశారు. రైతులతోపాటు, రాష్ట్రంలో చెరకు పరిశ్రమ అనుపానులు సమ

—కొరవ 11వ పేజీలో

# స్వాతంత్ర్య దినోత్సవం సర్కారు మొక్కుబడేనా?

'అర్ధరాత్రి స్వతంత్రం వచ్చింది' ఇంకా తెల్లవారనేలేదు!'

మన స్వాతంత్ర్యం ఒక ప్రహసనమంటూ మహాకవి ఎప్పుడో చేసిన ఈ రెండు పంక్తుల నిర్వచనం, ఇప్పటికి సజీవంగానే వుంది. స్వతంత్ర భారతావనిలో పగటు పొడుచిన స్వాతంత్ర్యం దినదినానికి హరించుకుని పోతున్నా, స్వాతంత్ర్య దినంమాత్రం వస్తూనేవుంది.

ఆగస్టు 15 అంటే పాతిక ముప్పయ్యేళ్ళ క్రితం ఎంత పవిత్రమైనదినమో! ప్రజలు దాన్నొక జాతీయ పర్వంగా జరుపుకునేవారు. ఎగిరేజండా రెపరెపల్లో తమ త్యాగఫలపు చిహ్నాలను, చారిత్రాత్మక సమర స్మృతులను దర్శించి ఉప్పొంగిపోయేవారు; ఊహల్లో ఉజ్వల భవిష్యత్తును కాంక్షించి, ఉత్తేజితులయ్యేవారు. మరి ఇప్పుడో? ఆదివారం వస్తే ఆగస్టు 15 ఒక సెలవుదినం క్రింద జమైపోతూంది; సర్కారువారి మొక్కుబడిగా మిగిలిపోతూంది. మానసికంగా, భావాత్మకంగా ప్రజలకు ఈ మహత్తర చారిత్రకదినానికి సంబంధం తెగిపోయిందా అన్పిస్తూంది. జనంలో జాతీయత లోపించడంకూడా ఇందుకొక కారణమేమో,

ఈ సోది వదిలేసి, అసలు విషయానికొస్తే, ఈ ఏడాది ఆగస్టు 15 కూడా, నెల్లూరులో సకల సర్కారు మొక్కుబడులతో,సర్వలాంఛనాలతో జరిగిపోయింది. రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి జెండా ఎగురవేశారు. జిల్లా కలెక్టర్లే జెండా ఎగరేసి, జిల్లా అభివృద్ధి కార్యక్రమాలను సమీక్షించడం ఇంతకాలం సాంప్రదాయంగా వుండేది. ఎన్టీఆర్ రద్దుల అస్త్రం వీటిపైకూడా సంధించడంతో, ఇటీవలే జెండా వందనం డ్యూటీ మంత్రులకు మారింది. కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్, ఎస్. పి. శ్రీ ఆర్. ఆర్. గిరీశకుమార్ మంత్రి ననుసరించారు; డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అహూతులలో ముఖ్యులు.

మంత్రిగారు పెద్ద దాలభారతమంత అభివృద్ధి పనుల చిట్టానే చదివారు. ఇళ్ళ కట్టడంలో నెల్లూరుజిల్లా రాష్ట్రంలో ప్రథమస్థానం పొందిందట. కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ ఖాతాలో జమపడవలసిన క్రెడిట్ ఇది. ఈ ఏడాది 15 వేల ఇళ్ళు కడుతున్నారని, 64 గ్రామాలకుమంచినీళ్ళిస్తారని మంత్రి చెప్పారు. గ్రామీణ ప్రాంతి పథకం క్రింద 8 కోట్ల 37 లక్షలు. కరువుకు కోటి 94 లక్షలు తుఫానుకు 3 కోట్ల 87 లక్షలు, ప్రభుత్వం నుంచి అందాయన్నారు,

తర్వాత, ఇళ్ళుకట్టడంలో అత్యంత శ్రద్ధచూపిన పల్లిపాడు సర్పంచ్ శ్రీ వేదా

> **ఆగష్టు 15**

చలంను సన్మానించారు. నెల్లూరు ఆర్డీఓ డాక్టర్ నాగేశ్వరరావు, బుచ్చి బిడిఓ శ్రీ బాలకృష్ణారెడ్డి, ఎస్ పి. శ్రీ గిరీష్ కుమార్, డి. ఆర్. డి. ఎ. ప్రాజెక్టు డైరెక్టర్ శ్రీ విశ్వనాథ్ తదితర అధికారులకు కూడా ప్రశంసాపత్రాలు ఇచ్చారు.

### పోతునాయుడు దిబ్బ

ముత్తుకూరు మండలంలోని పోతునాయుడు దిబ్బ స్కూలులో, సర్పంచ్ శ్రీ యానాటి రమణారెడ్డి పతాకావిష్కరణ చేశారు. హెడ్మాస్టరు శ్రీ ఎం. హరప్రసాదరావు మాట్లాడారు. టీచరు శ్రీ ఎ. రామసుబ్బయ్య వందనాలు చెప్పారు.

### ఆత్మకూరు పట్టాప్రదానం

ఆత్మకూరు తాలూకా గ్రామాల్లో ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవంగా కాక, ఎన్టీఆర్ పుణ్యమా అని పట్టాప్రదానోత్సవంగా జరిగింది.

—కొరవ 8 వ పేజీలో

# నెల్లూరు సంగతులు

### మానసిక వైద్య నిపుణుల సభ

రాష్ట్ర మానసిక వైద్యనిపుణుల 6వ వార్షికోత్సవ సభ 17 తేది టౌనుహాలులో జరిగింది. జిల్లా సెషన్స్ జడ్జి శ్రీ బి. శివసాంబమూర్తి జ్యోతిని వెలిగించి, సభను ప్రారంభించారు. డాక్టర్ జె. శేషారెడ్డి స్వాగతించారు. ఇండియన్ సైకియాట్రిక్ సొసైటీ అధ్యక్షుడు డాక్టర్ ఎన్. వి. రమణరావు అధ్యక్షించారు. ఐఎంఎ అధ్యక్షుడు డాక్టర్ ఎస్. కరిముల్లా సావనీర్ విడుదలచేశారు. డాక్టర్ ఎన్. వి రమణరావు డాక్టర్ కె. రామరెడ్డికి మానస హాస్పిటల్ అవార్డును బహూకరించారు. డాక్టర్ ఎం. ఎస్. రెడ్డి సందేశాలు చదివారు. డాక్టర్ సి. ఆర్ రెడ్డి వందనసమర్పణ చేశారు.

### సాహిత్య సదస్సు

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి 'స్వప్నమాల' సంస్కృతానువాద పఠన గోష్ఠి 14 తేది శ్రీ మతి దొడ్ల వెంకట రత్నమ్మ మహిళా గ్రంథాలయ భవనంలో జరిగింది. సాహిత్య సదస్సు దీన్ని నిర్వహించింది. శ్రీ గోనుగుంట వెంకట సుబ్బయ్య స్వాగతోపన్యాసం చేశారు

—కొరవ 8 వ పేజీలో

## నంద్యాల సబార్డినేట్ జడ్జి కోర్టులో

E. P, 108/1985 O. S. 115/1982

పూల రాజశేఖరం S/o. చిన్నరంగయ్య నంద్యాల. కర్నూలుజిల్లా—డి.హో.

బోరెడ్డిరామిరెడ్డి S/o. ఈశ్వరరెడ్డి కొట్టాలగ్రామం నంద్యాల తా॥ జే డి లు

ఈ నంబరు అయికం, ప్రిలిమినరీ డిక్రి వాకిక్రింద అయికం షెడ్యూలు స్థిరాస్తులను పై కోర్టువారి యెదుట 9-9-1986 తేదీన ఉదయం 10-30 గంటల నుండి సాయంత్రము వరకు పబ్లిక్ వేలం వేయబడును. కొనదలచిన సవాలుదార్లు వాయిదా దినం హాజరై వేలం పాడుకొనవచ్చును.

— షెడ్యూలు —

కర్నూలు డి॥ నంద్యాల సబ్ డి॥ లో చేరిన నంద్యాల గ్రామ పొలంలోని అయికం షెడ్యూలు దాఖలా స్థిరాస్తుల వివరం :

1) స. పుంజ స. నం. 2369/1 య. 0 28 ట్లు లేక (1133 12 చ॥ మీ॥) శిస్తు 0-50 పూర్తి డి.హో. మదింపు రు. 2000/- అమీనా మదింపు రు. 20000/-

2) స. పుంజ స. నం. 2365 పైకి య 3-48 ట్లు లేక (14083 07 చ॥మీ॥ శిస్తు 4-00 చేని పేర అర్ధవాగు చేను చెక్కబంది:.

తూ) ఎస్. నం. 2369/1 భూమి ప) యిదే నంబరు లోని భూమి. గాంతిరెడ్డి తాలూకు భూమి ఉ) కె.సి. కెనాలు ద) ఆళ్ళగడ్డ నాగిరెడ్డి వగైరాల భూమి డి హో. మదింపు రు 10000/- అమీనా మదింపు రు 66000/-

సం:- ఐ సి.లోని తగాదాలు 16-1-69తేదీన జే డి లు రు 2500/-కు విక్రయించుకొన్న భూమి గాన బాధించదు

2) 1-4-1969 తేదీన రు. 3000/-కు సం॥ 1-కి 100 కి రు. 8-75 పై ప్రకారం నంద్యాల సహకార భూమి తనఖా బ్యాంకు వారికి జే డి లు వుంచిన అయికం బాకీ అసలు వడ్డీన్ని లోబరచి పై రెండు అయిటములు ఒకే లాటుగా వేలం వేయులాగున-

డి.హో. మదింపు రు 5000/-

3) 29 9-78 తేదీన డి హో. పేర జె డి లు రు. 7500/-కు వుంచిన అయికం బాకీ ఈ నంబరు డిక్రీయే కావున వేలం వేయబడును.

సూర నాగరాజరావు

డి.హో. తరం ఆడ్వొకేటు. నంద్యాల

# "నామీద వార్త రాస్తావా-నీ అంతు తేలుస్తాను"!

8-8-88 తేది 'జమీన్ రైతు' లో విశ్వోదయ విద్యాలయం తెలుగు మహిళ వసతిగృహం కట్టించదట- అనే శీర్షికతో పూను పేరు లేకుండా ప్రకటింపబడిన ఒక వార్తకు ఒక జ్యోతి అగ్రహావేశపరులై, 17 తేది రాత్రులో ఇరువురు శ్రీ నేదురి సుందరరామశర్మ ఇంటికి పోయి ఆవార్త వ్రాసింది ఎవరు అని దబాయింపుగా,

> జమీన్ రైతు
> విలేఖరిపై
> కావలి
> తెలుగు
> ఆడబడుచు
> ఆగడం

జబర్దస్తీగా అడిగిందట. ఆ సమయంలో ఆ ముసలి తండ్రులు పదిమంది పిల్లలకు ప్రశాంతంగా ట్యూషన్ చెప్పుకుంటుండి నారట. మా వ్యాఖ్యకు ముందు ఆజ్యోతి, శర్మగారల మధ్య జరిగిన సంభాషణ ఇస్తాము-

జ్యోతి: జమీన్ రైతులో ఆ వార్త వ్రాసిందెవరు?

శర్మ: నాకు తెలియదు

జ్యోతి: మరెవరు వ్రాశారు?

శర్మ: ఎవరైనా వ్రాయవచ్చు; నాగ రాజారావు, బాల్యకూడా వ్రాయొచ్చు; అసలు పత్రికవాళ్ళే తెలిసికొని తమంతట తాము వ్రాసుకుంటుంటారు.

జ్యోతి: వాళ్ళు తాము వ్రాయలే దన్నారు.

శర్మ: నేనుకూడా అదే మాట చెప్తున్నాను

జ్యోతి: సుందరరామశర్మ వార్త పంపా డని జమీన్ రైతు రామమూర్తి చెప్పారు.

శర్మ: అది అబద్ధం. నిజంగా వ్రాసిన వారిపేరే పత్రికాధిపతి చెప్పరు. 'అటు వంటప్పుడు వార్తతో సంబంధంలేని నా పేరు ఎందుకు చెబుతారమ్మా!

జ్యోతి: కాదు; రామమూర్తి మీ పేరు చెప్పారు.

శర్మ: అబద్ధం, నిజమైతే నా ఎక్కడాలు చూపించండి-

జ్యోతి: నేను చేసేపన్లు పనూలు చేసి నట్లు ఎవరైనా చెప్పారా? అందులో నా పేరు లేకున్నా కావలిలో మహిళా కార్యకర్తను నేనని 50 వేల జనాభాకు తెలుసు గదా?

శర్మ: నాకు తెలియదు.

జ్యోతి: జంతదూరం వచ్చింది. ఎంత దూరమైనా పోయి మీ అంతు తేలుస్తాను.

శర్మ: సరే!

-కొరవ 7 వ పేజీలో

# చక్కెరఫ్యాక్టరీ బకాయిలు-బ్యాంకుల నిర్బంధాలు

కోవూరు చక్కెర ఫ్యాక్టరీ నిర్మాణ సమయంలో దాని భాగస్వాములుగా బల వంతంగా చేర్పించబడి, బ్యాంకి రుణం ఇంతింతై వటుడింతై చెల్లించవలసిన వీలు కావంతటై, పనూలులో బ్యాంకుల జబర్దస్తీకి గురియవుతున్న రైతాంగం పాత కలెక్టరు అర్జునరావు, మరికొందరు అనధికార్లను నిత్యం ఎండవేళ తలచుకొని సమస్కరిస్తున్నది! అప్పులిచ్చినవారిలో జాతీయ బ్యాంకులైతే రావాలు దగ్గాలతో మర్యాదగా పనూలు చేసుకొంటుండగా, వ్యవసాయాభివృద్ధి బ్యాంకులవంటి సంస్థల సిబ్బందిమాత్రం అనాగరికంగా ప్రవర్తిస్తున్నది.

ఈ క్రింది వార్త ఇప్పటిది కాదు; రెండునెలలనాటిది. అయినా ఆ సమస్య మాత్రం పందలాది షేర్‌హోల్డర్లను కల వరపరుస్తూ, భ్రుంగదీస్తూవుంది. కోవూరు ఎ డి బి,వారు షేరుధనబకాయీలవనూలు నోటీసులుతెస్తే, అప్పుడు కొంతకట్టి మిగ తది చెరకు కొట్టిన తర్వాత కట్టగలమని చెప్పారట. కాని పది హేను మంది సిబ్బంది ఇద్దరు పోలీస్ కానిస్టేబుళ్ళ సహాయంతో జూన్ 19 తేది యజమాని

> జిల్లావార్తలు

లేనిసమయంలో ఇంటిమీద దాడి చేసి, స్త్రీలను అమర్యాదకరంగా మాట్లాడి, డైనింగు టేబిలు, టి. వి., రెఫ్రిజిరేటరు లను వీధిలోవేసి, అంధుడైన తనతండ్రిని బెదరించి, బీరువాతాళాలు తీసుకొని, బీరువాలోని రూ 4000 లు బలవంతంగా చేజిక్కించుకొని, రసీదులు ఇచ్చి, తిరుగా 23 తేది వస్తామని, అప్పుడు కొరవ చెల్లించకుంటే సామాన్లన్నీ బయట వేస్తామని బెదరించి పోయారట. బ్యాంకి వారి దౌర్జన్యాలు ఈ విధంగా కొనసాగ వలసిందేనా అంటాడు ఆ రైతు.

ఈ అనుభవం ఎవరిదోకాదు, తల మంచి సర్పంచ్ శ్రీ కొన్నా వెంకయ్య గారిదే. ఒక సర్పంచ్ విషయంలోనే ఇట్లా జరిగితే ఇక సామాన్యుల విష యంలో ఎట్లా వుంటారో పూహించుకో వచ్చు. బహుశా ఇటీవల ఎ. డి. బి. వారినుండి ఇటువంటి దౌర్జన్యాలు జరిగి నట్లు వినబడడంలేదు, పనూలు కాకుంటే కోర్టుకు పోవాలిగాని, ఈ దౌర్జన్యకర్తలు ఏమిటి? వెంకయ్యగారికి జరిగిన అవ మానంమీద పై అధికార్లు విచారణేమైనా జరిపారా? బాధ్యులైన వారిపై చర్య ఏమైనా తీసుకున్నారా?

* * *

బ్యాంకు అప్పులు, నిర్బంధాలనుండి

-కొరవ 7 వ పేజీలో

# కావలికమీషనర్ నిస్సహాయుడయ్యాడు

మూడు సంవత్సరాలక్రితం కనెక్షన్ కులాయికిగా రూ 750 లు చెల్లించి, ఈనాటివరకు కనెక్షన్‌రాక, తిరిగి తిరిగి విసిగి వేసారి ఏనాడూ పత్రికకు ఏవిష యమూ వ్రాయని పెద్దమనిషి, రిటైర్డు హైస్కూలు హెడ్మాస్టరు, ఎస్ కైవళ్ళ శ్రీ పి. చెన్నారాయుడు ఎం ఎ., బి.ఇడి. వ్రాసిన వృత్తాంతం చదువుతుంటే గుండె తరుక్కుపోతుంది; అటువంటి అవినీతిపరులు, తన పై ఆఫీసర్ల ఆదేశాలనుకూడా లక్ష్యపెట్టని వుద్యోగులను ఏమిచేస్తే పాపంపోతుందాఅనిపిస్తున్నది.

కావలి జనతాపేటలోని తన ఇంటికి కులాయి కనెక్షన్ ఇవ్వవలసిందిగా రూ 750/-లు చెల్లించి 29-9-83 తేది మునిసిపాలిటీకి దరఖాస్తు పెట్టుకున్నాడట, తనకంటే వెనుక దరఖాస్తులు పెట్టుకున్నవారికంతా వెంటవెంటనే ఇస్తున్నారటగాని, తనమొహం చూచినవారు లేరట. పాత కమీషనరుకు, తమవార్డు కౌన్సిలరుకు చెప్పుకున్నాడట. ఇదిగో అదిగో అంటూనే కాలయాపనచేసేవారట.

> కావలి మునిసిపల్
> సూపర్‌వైజర్
> నిర్లక్ష్య వైఖరి-
> చెన్నారాయుడు
> అనుభవ గాథ

కొత్త కమీషనర్ శ్రీ లక్ష్మీనారాయణ రెడ్డి మంచివాడని. మర్యాదస్తుడని, నిజా

-కొరవ 7వ పేజీలో

# నెల్లూరు ఇరిగేషన్ శాఖ ఇ. ఇ. నామినేషన్ పనుల గొడవలు

నెల్లూరు పి. డబ్ల్యు. డి కార్యాలయం కుంభకోణాలకు నిలయంగా మారిపో తూంది. ప్రజాధనాన్ని తమచిత్తంవచ్చిన రీతిలో, స్వప్రయోజనవ్యక్తుల కోసం విచ్చల విడిగా ఖర్చుచేయడం పి. డి. అలవాటై పోయింది. పత్రికలలో వ్రాసినా, ఎన్ని సార్లు వ్రాసినా, పరిస్థితిలో ఏమీన మార్పు వుండడ లేదు; కలెక్టర్ వంటి ఉన్నతాధి కారులు హెచ్చరించినా అనుపంత వెరపుకూడా కల్గడంలేదు; ప్రజారోగ్యమండలిలో ప్రజాప్రతినిధులు చేసే విమర్శలకు గడ్డిపోచంత విలువ వుండడం లేదు అధికారుల ఇష్టారాజ్యమైపోయింది తెలుగుదేశం ప్రభుత్వం పాలనలో!

ఆమధ్య బుచ్చిరెడ్డిపాళెం డి వి జన అధికారులు కనిగిరి రిజర్వాయర్ నీటిని రెండోపంటకివ్వడానికి రేట్లు నిర్ణయించి, వేలంపెట్టి, విక్రయిస్తే, అడిగిన దిక్కు లేరు; కలెక్టర్ బెదరింపులు వాటాకు చప్పాళ్ళు అయ్యాయి; తర్వాత కావలి కాలవలో ఒక ఎగ్జిక్యూటివింజనీరు లక్షలకు లక్షలు దుర్వినియోగం చేశాడని పత్రికలలో రచ్చరేగినా పట్టించుకున్న వారులేరు; రెండునెలల క్రితం నెల్లూరు లోనే టెండర్ల విషయంలో జరిగిన గోల్మాల్ బయటపడినా ఏచర్యాలేదు. ఇప్పుడు మరొక కుంభకోణం వెలుగులోకి వచ్చింది. ఇదికూడా ఇరిగేషన్ డివిజన్‌కు సంబంధించినదే!

> ఇ. ఇ ఇచ్చిన
> నామినేషన్లను
> ఎస్. ఇ. రద్దుచేశాడట-
> కొత్తవారిని
> టెండర్లు వేయవద్దని
> ఇ. ఇ. ఆదేశమట

ఈ డివిజన్‌లో ఇటీవల ఐదారు పనులు నిర్ణయించారట. ఇవేవీ అత్యవసర మైనవికావు. అయినా నెల్లూరుసెంట్రల్ సర్కిల్ ఎగ్జిక్యూటివింజనీరు వీటన్నింటిని తన మనుషులకు నామినేషన్లమీద పంపకం పెట్టేశాడట. ఆ పనులివి- పైడేరు ఎస్కేప్ పట్టర్ప నిర్మాణం; పుత్తేరు చెరువు సప్లయి కాలువత్రవ్వకం; పాత యల్లాయపాళెం కాల్వ; కనిగిరి చెరువులో సప్లైకాల్వ రిపేర్లు; దగదర్తి ం చర్లపాడు కాల్వపని!

ఎగ్జిక్యూటివింజనీరుగారి ఆశీర్వాదం దండిగా వున్నందునన్ల కాంట్రాక్టర్లు పని కూడా ప్రారంభించేశారట అయితే నామినేషన్ల పంపిణీ ఫలితం ఇ. ఇ. కి ఒక్కరికే దక్కిందనో, లేక మరేదైనా కారణముందో తెలియదుగాని ఎస్ ఇ శ్రీ విశ్వనాథరావు బదిలీపైవెళ్తూ పటన్ని టిని రద్దుచేసి పోయారట. పాపం. కాంట్రాక్టర్లు హతాశులైనట్లున్నారు.

-కొరవ 8వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## ఈ వారమూ అంతే

ఈరోజు వరకుకూడా వర్షం లేదు; పెన్నకు నీళ్లురాలేదు; ఎండ మండిపోతున్నది.

ఫిల్టర్ పాయింట్లలో కూడా నీళ్ళు తగ్గిపోవడమో, అసలు రాకుండా నిల్చిపోవడమో జరిగింది. మెలగొలుకు నార్లు నాటేకి పదివేలఎకరాలకూడా పోయలేదు. అక్కడ వరదలు; ఇక్కడ నీటికరువు!

## రెవిన్యూమంత్రి

రెవిన్యూమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులరెడ్డి-23 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు కోట, గూడూరులలో కార్యక్రమాలు. ఆ రాత్రికే మద్రాసు వెళ్ళి అక్కడినుంచి 25 హైదరాబాదు వెళ్తారట. మంత్రిగారు మరీ కోటకే పరిమితమైపోతున్నట్లున్నారు!

## నీటికోసం హాహాకారాలు

నెల్లూరు టౌన్ తీవ్రమైన నీటి ఎద్దడికి గురౌతూంది; ఆ పేట, ఈ ప్రాంతం అనే తేడాలేదు; టౌన్ నాలుగుమూలలా జనం దాహం... దాహం...అని హాహాకారాలు చేస్తున్నారు. మరీ కొత్తగా విస్తరించిన దర్గామిట్ట కాలనీలు, నగర్లలో పరిస్థితి దుర్భరంగా వుంది.

రోజుకు పట్టుమని పదినిమిషాలుకూడా మునిసిపల్ కొళాయిలలో విలకడగా నీళ్లు రావడంలేదు. అదికూడా బొట్టు బొట్టుగా కారుతున్నాయేతప్ప, బిందె నిండుగక్కే వేగం లేదు. కాలువ గట్లపైన మురికివాడల్లో నివసిస్తూ కేవలం వీధి కొళాయి నీళ్ళపైనే ఆధారపడిన వారి అగచాట్లు చెప్పనలవికాదు. ఒక్కొక్క కొళాయి దగ్గర బిందెల బార్లు ఫర్లాంగుదూరం వరకు వుంటున్నాయి; గంటల తరబడి గంగాకటాక్షం కోసం ఎదురుచూడవలసి వస్తూంది.

బావులుకూడా ఎండిపోయాయి. దర్గామిట్టలో అయితే ఊటకూడా కన్పించడం లేదు. మైళ్ళదూరం నడిచి, పొలాలలోని గుంటలు, బావులనుంచి నీళ్ళు తోడుకుని వస్తున్నారు. నెల్లూరులో ఇంతనీటికటకట ఎప్పుడూ ఎరుగము పెన్న ఎప్పుడో పట్టిపోయింది; చెరువునుంచి బురదనీళ్ళే అయినా కొద్దిరోజులు సరఫరా చేశారు. ఇప్పుడవీ అడుగంటిపోయాయి. వానలుపడి పెన్నకు ప్రవాహం వస్తే తప్ప మునిసిపల్ అధికారులు చేయగల్గిందేమీ వున్నట్లులేదు. వానలు పడకుంటే దర్గామిట్ట విస్తరణ ప్రాంతం వాసులు వలసపోవలసి వస్తుందేమో! నిజంగానే పరిస్థితి అంత తీవ్రంగా వుంది.

## అంతా మోసం!

కోవూరు చక్కెర ఫ్యాక్టరీని రెవిన్యూ మంత్రిగారు స్వతంత్రదిన పవిత్ర పర్వదినాన మీ చేతులలో పెడతారు గెస్టుహౌస్‌కు రండహో అని ఫ్యాక్టరీ ఉద్యోగులు చాటింపు వేయగా, యాభై అరవై మంది రైతులు ఆశతో ఆదుర్దాగా పరుగెత్తారట. అందరూ హాల్లో కూర్చోగా, ఒకరిద్దరు రైతునాయకులు కాబోలు మంత్రిగారి గదిలోకి పోయారట. లోపల ఏమిజరిగిందో ఏమో తెలియదు; మంత్రి శ్రీనివాసులురెడ్డిగారు మాత్రం హాల్లోకి వచ్చి ఫ్యాక్టరీ ఛెర్మెన్‌గా రైతులపక్షంగా కలెక్టరుగారు వుంటారని ప్రకటించారట. కలెక్టరుగారు కొత్తగా ఛెర్మెన్ కావడమేమిటి; ఇప్పుడు ఛెర్మెన్ ఆయనేగదా? రైతుల ప్రతినిధులుగా కలెక్టరు ఛెర్మెన్‌గా వుండడమేమిటి? పచ్చిమోసం, దగా అని అక్కడ చేరిన రైతులు మంత్రిని, ప్రభుత్వాన్ని సబ్బండు పాడుతూ నిష్క్రమించారట

వాస్తవంగా జరిగింది ఇదైతే ఫ్యాక్టరీని రైతులకప్పగించామని పత్రికా ప్రకటన చేయడానికి మంత్రి శ్రీనివాసులురెడ్డి ఎట్లా సాహసించారో ఆశ్చర్యం! మొత్తానికి ముఖ్యమంత్రి రామారావు, ఆయన శిష్యగణమైన మంత్రులు ప్రజల కండ్లకు గంతగట్టి ఆడించచూస్తున్నారు!

## చక్కెరఫ్యాక్టరీ-మేనకూరు-దొడ్ల ఏకం?

అక్టోబరు 2 తేది జరగవలసిన చక్కెరఫ్యాక్టరీ ఎన్నికలు వాయిదాపడ్డాయట.

అలాలేదు చూలులేదు కొడుకుపేరు సోమలింగం అన్నట్లు రేపు డైరెక్టర్లుగా ఎవరు ఎన్నికోబడబోతారో, వారు ఛెర్మెన్‌గా ఎవరిని కోరుకుంటారో ఏమోకాని, ఛెర్మెన్ పదవికి అభ్యర్థుల ప్రయత్నం మాత్రం తీవ్రంగా వున్నదంటున్నారు. ఇప్పటివరకు రంగంలో ముగ్గురు అభ్యర్థులు వుండినారట-సామంతు సుబ్బారెడ్డి, మేనకూరు బాలకృష్ణారెడ్డి, బెజవాడ ఓబులరెడ్డి తాజాగా వినబడుతున్నదానినిబట్టి బాలకృష్ణారెడ్డికి అనుకూలంగా ఓబులరెడ్డి ముగించుకున్నారనీ; ప్రస్తుతం సామంతు సుబ్బారెడ్డి, మేనకూరు బాలకృష్ణారెడ్డిగారలు మాత్రం ప్రయత్నంలో వున్నారని తెలుస్తున్నది.

చక్కెర ఫ్యాక్టరీ ఛెర్మెన్ పదవికి బాలయ్యను ఓబులరెడ్డిగారు బలపరచేటట్లు; రేపు మండలం అధ్యక్షపదవికి ఓబులరెడ్డి సతీమణి శ్రీమతి ఈశ్వరమ్మను బాలయ్య బలపరచేటట్లు ఒక రహస్య ఒప్పందమని పుకారు. మేనకూరు-దొడ్ల మధ్య ఒప్పందమా? ఇది నమ్మదగిన విషయమా? నిజమైతేమాత్రం సుబ్బారెడ్డి నక్కతొమ్కు తొక్కినట్లేనని ఇప్పుడే చెప్పవచ్చునేమో?

మరొకవదంతికూడావుంది. ఛెర్మెన్‌ను డైరెక్టర్లు ఎన్నుకోవడం కాకుండా, నేరుగా వుత్పత్తిదారులే ఎన్నుకునే పద్ధతి ప్రవేశపెట్టబడవచ్చునంటున్నారు. డైరెక్టరయితే తర్వాతుగు మంది మాత్రమే; వుత్పత్తిదారయితే నాలుగువేలమంది! డైరెక్టు ఎలక్షనైతే ఒత్తిడులకు, నిర్బంధాలకు,కొనుగోళ్లకు అవకాశంవుండదుగదా!

## రిజర్వేషన్లు-విద్యార్థుల అరెస్టు

రిజర్వేషన్స్ వ్యతిరేక ఉద్యమం నెల్లూరులో ఇంకా ఊపందుకోలేదు. ఎవరో కొందరు విద్యార్థులుమాత్రం రాష్ట్ర ఉద్యమ కార్యక్రమాన్ననుసరించి, నెల్లూరులో కూడా జరిపామనిపిస్తున్నారు. మొన్న 16 తేది రాస్తారోకో ఉదయం 8 గంటలవరకు మాత్రమే జరిగింది.

21 తేది సహాయ నిరాకరణోద్యమంలో విద్యానగర్ ఇంజనీరింగు కాలేజి విద్యార్థులు మాత్రం టిక్కెట్లు లేకుండా ఆర్. టి. సి. బస్సులలో తిరిగారు.

22 తేది ఉదయం కాలేజీల ఎదుట పికెటింగ్- వి. ఆర్ కాలేజిదగ్గర జరిగింది. పెద్దసంఖ్యలో విద్యార్థులనరెస్టుచేసి, వదలి పెట్టారు.

## సంస్మరణ

ఏడేళ్ళక్రితం (20.8 79) మమ్ముల వీడిపోయిన మాసారధి, మాసచివుడు మా నెయ్యము, మా సఖుడు, సేవా తత్పరుడు తూపిలి పార్థసారధిగారిని సంస్మరిస్తూ, వారికి అంజలి ఘటిస్తున్నాము.

-జమీన్ రైతు

## నీటిమట్టం

| | |
|---|---|
| సర్వేపల్లి రిజర్వాయరు | 2 . 2 అ. |
| నెల్లూరు చెరువు | 9 . 0 అ. |

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు 9672 | 1800-00 |
| 2508 | 1450-00 |
| ఐ ఆర్ 20 | 1500-00 |

# శివారెడ్డి పద్యాలు

### గోదావరి వరద

వాథగుండె గుండె బ్రద్దలైపోతుంది
కరిగిపోయింది వదిలో కలిసిపోయింది
వందలాది ప్రజలు పొరలెంట పొకలట్టి,
అర్ధనకు దేవ్వ భిమాస్తు!
పోతుపోతు పెన్నిగోతి కాడంబారు
కాదనంటినూత్రం కనికరించి
వాయిదేసి మనల వదిలేసిపోతాశ
కాలయముడు వరద! ఆల్లావార్తి!

### పేరా అమ్మాయి పెళ్ళి

మంత్రికాథిపతులు పరిమంది విత్రేసి
అష్టలెండరెండ్రో హాజరైయ్యి
అందజేసినారు ఆశీనులొకరెంట
వొకరు, క. కి దీంతొ వొరిగెరేంది?

మాజీమంత్రి నేద్రుమల్లి, గోపాల్‌రెడ్డి
అర్ధగంట ముందుగానెవచ్చి
కొల్యాదీరినారు కుర్చీల్లో కళ్యాణ
మంటపానికిదొక మణిపుకోళ!

ఆనమోరురాల, అపెంటు మాగుంట,
కానరాల గుంట్ర, రానెరాల

జక్కదేగ పెద్దదిక్కు ప్రాబ్లమయేది
అందరొస్తె, కాఫీ విందు బిల్లి?

ఎన్ని మైనపుదలతెన్నెన్ని కాంగ్రెసు
ఎన్ని బుట్టు వతలు ఎంత పుష్ప
మూరుకట్టుగప్పి మటుమాయమయ్యాయి
ఒరషణంలో శేతు అంతుపొంకు!

తిట్టవచ్చు తేర నెట్టొచ్చు పెడబట్టి
కాల్తో తన్నవచ్చు కన్నకొడుకు
అదొక లెక్కగాదు అరుబిడ్డ బాధ
అంతయింతగాదు అదొక నరకం!

ముద్దులాడుతారు ముద్దుట్టుబడరాదు
చదువుసాముజెప్పి సాకుతారు
యీడుకొచ్చినాక యీడ్చిపారేస్తారు
అడుబిడ్డ లైపు అమిత చీపు!

### పోలంరెడ్డి శైలజ

శిథిలమౌను చీకిచీనాంబరములిస్తె,
కత్తెరోళ్ళ భయము కనకమిస్తె
పారితోషికంగ పద్యాలు కొన్నిచ్చు
దండగుట్టి మెళ్లోదాల్చు శైల!

# జిల్లావార్తలు

(5వ పేజీ కొరవ)

చక్కెర ఫ్యాక్టరీ షేర్‌హోల్డర్లను కాపాడా లని జిల్లా చెరకు ఉత్పత్తిదార్ల సంఘం కార్యదర్శి శ్రీ గునుపాటి రామచంద్రయ్య ఆ పేదవారి పక్షంగా ఆర్తనాదం చేస్తు న్నారు.

అనాడు జాయింట్ ఫార్మింగ్‌సొసైటీ సభ్యులందర్నీ చక్కెరఫ్యాక్టరీ షేరు హోల్డర్లనుచేసి బ్యాంకులనుండి ఒక్కొ కరికి వెయ్యిరూపాయలవంతున రుణం ఇప్పించి షేర్లు కట్టారని, కాని వారు బ్యాంకురుణాలు చెల్లించలేకపోయారని, ఇప్పుడు ఆమొత్తం వడ్డీతోటి మూడువేలు అయిందని, బ్యాంకువాళ్ళు దాని వసూ లుకు దావాలువేసి డిక్రీలుపొంది, వెంటనే చెల్లించకుంటే అరెస్టు చేయించగలమని బెదరిస్తున్నారని, అటువంటివారి షేర్ల సొమ్మంతా ప్రభుత్వంగాని, తేక ఫ్యాక్టరీ గాని తీసుకొని, వారిని రుణవిముక్తులను చేసి సహాయపడాలని రామచంద్రయ్య కలెక్టరుగారికి విజ్ఞప్తిచేస్తున్నారు.

ఈ షేర్ల మొత్తం చెల్లించలేనంతగా పెరిగిపోయి హరిజన గిరిజనాది పేదలే కాదు, మధ్య తరగతి రైతాంగంకూడా ఆవేదన చెందిపోతున్నది. కలెక్టరుగారు చొరవ తీసుకొని వీరికి సహాయం జరిగే మార్గం ఆలోచించగలిగితే వారి వుపకా రాన్ని కలకాలం జ్ఞా ప కం వుంచు కుంటారు.

### ఆత్మకూరు డిగ్రీకాలేజి

శాసనసభ్యుడు డాక్టరు బి. సుందర రామరెడ్డి ఎట్టకేలకు ఆత్మకూరుకు డిగ్రీ క ళా శా ల సా ధిం చా డు! మొదటి ప్రయత్నం రాజకీయ సుడిగుండంలో పడి, వి ఫ ల మై నా; ఇప్పుడుమాత్రం వి జ యు డ య్యా డు. డా. పాముల రామయ్య -జానకమ్మగారల విరాళంతో డిగ్రీకాలేజి వెలసింది. స్వా తం త్ర్య దినము, తిథులరీత్యాకూడా మంచిరోజు కావడంవల్ల లాంఛనంగా 15 మంది విద్యార్థులను చేర్చుకోవడంకూడా జరి గింది. శ్రీ కె. వెంకటసుబ్బయ్య ప్రిన్సి పాల్, శ్రీ జె. యానాదయ్య కాలేజి కర స్పాండెంటు.

ప్రస్తుతానికి కాలేజి కాంగ్రెస్ ఆఫీ సులో నడుస్తుంది. బి. ఎ., బి. కాం., బి. ఎస్‌సి. లు వుంటాయట.

### వాకాడు జవాబు

మాజీ రెవిన్యూమంత్రి శ్రీ నేదురు మల్లి జనార్దనరెడ్డి ఆ మ ధ్య నల్లపరెడ్డి వారిమీద చేసిన ఆరోపణలకు వాకాడు మండలం తె దే. అధ్యక్ష, కార్యదర్శులు నన్నారెడ్డి శ్రీనివాసులురెడ్డి, కోట శ్రీని వాసులుగారలు జవాబు ప్రకటనపంపారు.

కోటలో నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి పేర కమ్యూనిటీ హాలుకడుతున్న అర ఎకరాస్థలం అల్లారెడ్డి రవికుమారరెడ్డి. విజయకుమారరెడ్డిగారలు వు చి తం గా ఇచ్చిందట. పెట్రోలుబంకు స్థలంకూడా శ్రీ అల్లారెడ్డి వెంకటకృష్ణారెడ్డి కుమార్తె సురేఖమ్మ భూమిఅట.

శ్యామసుందరరెడ్డి ఇచ్చిన స్థలంలో 164 మంది పేదలకు ఇండ్లస్థలాలు 15 తేది పట్టాలు ఇవ్వబడినవట.

ఇదీ వారి ప్రకటన సారాంశం. ఆ స్థలాన్ని ఏనాడో పేదలకు పట్టాలు ఇచ్చా మని జనార్దనరెడ్డి దాఖలాలలో కూడా చెప్పారు. ఇప్పుడు కొత్తగా ఇవ్వడమే మిటి? పాతవి రద్దుచేసి, కొత్తవారికి ఇవ్వ డమా?

### వితంతువులను మోసం చేసిన వెధవలు

13 తేది గూ డూ రు సమీపం గిరి శాస్త్రులవారి ఖండ్రిగ, రామలింగాపురం గ్రామాలకు ఇ ద్ద రు యువకులుపోయి తాము వితంతువులకు నెలసరి పెన్షను, వెయ్యిరూపాయల సహాయం ఇప్పించే రెవిన్యూ వుద్యోగులమనిచెప్పుకొని అరవై మందిచేత అద్యాన్నుగా ఐ దే సి రూ పా యల వంతున వసూలుచేసికొని, 16 తేది తిరిగివస్తామని, అప్పటికి ఫోటోలతోటి రెడిగావుండమనిచెప్పి, మ ధ్యా హ్నం ఒకఅమ్మ ఇంట్లో భోంచేసి వుడాయిం చారట.

నెలనెల పెన్షను, వెయ్యిరూపాయలనే సరికి కొం ద రు ముత్తయిదువలు తమ మంగళసూత్రాలు, బొట్టు దా చు కొ ని, తామూ ముండమోపులమేనని ఐదురూపా యలు సమర్పించి దణ్ణం పె ట్టు కు న్నా రట. —మా గూ. వి.

### గూడూరు వార్తలు

అగస్టు 15 తేది గూడూరు డివిజనులో మొత్తం 3984 ఎకరాలు సమారాధన చేశారట. ఎవరిదో ఎవరో దానం చేసి నట్లు!

• • •

13 తేది మద్రాసు మెయిల్లో ప్రయా ణిస్తుండిన ఒక యువకుడు పై బెర్తునుండి క్రిందపడి తలకు గాయంతగిలి గూడూరు ఆస్పత్రిలో చేర్పించబడి 15 తేది చని పోయాడు. ఆస్పత్రిలో చేర్పించే సమ యానికి ఆ యువకుడికి కొంచెం స్పృహ వుండినదట; తన తండ్రి పేరు హనుమంత రావు అని, వి జ య వా డ లో జర్న మర్చంటని చెప్పాడట. ఆస్పత్రివాళ్లు పో లీ స్ కు రిపోర్టు చేశారేకాని, వారి తండ్రికి తెలిపే ప్రయత్నం చేయలేదు. పోలీస్‌కు కూడా అటువంటి మంచి ఆలో చన వచ్చినట్లు లేదు. లేకుంటే అతని తల్లిదండ్రులువచ్చి మద్రాసుకు తరలించి మంచి చికిత్స చేయించుకొనివుండేవారు. పాపం, ఆ యువకుని తల్లిదండ్రులు చని పోయినరోజు రాత్రి వచ్చి నె త్తి నో రు బాదుకున్నారట. అతనికి వదిరోజులలో వి వా హం నిశ్చయమై వుండినదట! పాపం!

### కావలి కమీషనర్

(9 పేజీ కొరవ)

యిదీ పరుడని తెలిసి చెన్నారాయుడు గారు ఆయన్ను స్వయంగా కలుసుకొని తనగాథ చె ప్పు కు న్నా ర ట. ఆయన వెంటనే సూపర్‌వైజర్ ప్రసాద్‌ను పిలిచి వారంలోగా కనెక్షన్ ఇవ్వవలసిందిగా ఆదేశించాడట. అతను సరేనన్నాడట. పదిహేనురోజులు గడచినా అంతులేదట. చెన్నారాయుడుగారు రెండవసారి కమీ షనర్‌ను కలుసుకున్నారట: ఆ య న మరలా ప్రసాద్‌కు అదే ఆదేశం జారీ చేశాడట. ఇక తర్వాతికథ చెన్నారాయుడి గారి స్వంతమాటలలోనే చదవండి-

"విచారించగా క నె క్ష ను లు తెచ్చు కున్నవారు చెప్పడంతో రు. 300 లు లంచం ఇస్తేగాని కనెక్షను ఇవ్వరని తెలిసి నది. జరిగిన ఆలస్యానికి, నిరాదరణకు ఇది కారణమని తెలుస్తున్నది. చదువు కున్నాడు, 80ఏండ్లు వయస్సు వచ్చింది గాని పనిచేసుకోవడం తెలియదని సదరు సూపరువైజరు అన్నాడట. అది నిజమే. నా అసమర్థతను ఒప్పుకుంటాను. నేను ఎవరివద్ద లంచంపుచ్చుకోలేదు. ఇవ్వనూ లేదు. ఈ చరమదశలో నియమభంగం చేయలేక విసిగి మూడవసారి23-7-86 కమీషనరుగారిని కలసికొని జరిగినవైనం మనవిచేసి కనీసం నా డిపాజిట్ అయినా వాపసు చేయించమని ప్రార్థించాను. ఆయన చాలా మనసునొచ్చుకుని, వారం రోజుల్లో కనెక్షన్ ఇచ్చే ఏర్పాటు చేస్తా నని, లేకపోతే డిపాజిట్ వాపసు చేస్తా నని, ఎంతో బాధతో చెప్పారు"

సిగ్గుతో తలవంచుకోవడం, చెన్నా రాయుడుగారి ఆవేదను పంచుకొని ఆవేశ పడడంతప్ప ఈ వ్యవస్థలో మనం చేయ గలిగిందేముంది? ★

### నీఅంతు తేలుస్తాను

(5వ పేజీ కొరవ)

సంభాషణానంతరం ఆమె జ ను రు వ పోతూ పైకి వస్తున్నవారిపై విలేఖరులు తప్పుడువార్తలు పంపి అ ప్ర తి ష్ఠ కల్గి స్తున్నారంటూ గొ ణు క్కుం టూ వెళ్ళి పోయిందట,

పత్రికా విలేఖరులనేవారి స్థి తి గ తి అఖరుకు ఎట్లా తయారైందో చూడండి. ఒక అ డ కూ తు రు మగరాయుడిలా యథార్థం తెలుసుకోకుండా ఒకరింటికి పోయి నీ అంతు తే లు స్తా న నేం త టి సాహసం ఎవరివల్ల వచ్చిందో, ఎట్లా వచ్చిందో, ఎందుకొచ్చిందో అనుకుంటే ఆశ్చర్యం కలుగుతున్నది.

ఎవరైనా వ్రాయవచ్చు: ఏ మై నా ప్రచురణ కావచ్చు: పత్రికలో వచ్చే ప్రతి అక్షరానికి సంపాదకుడిది బాధ్యత. దేన్నిగూర్చి అయినా అడగదలచుకుంటే సంపాదకుణ్ణే అడగాలి: జవాబు వ్రాయ దలచుకున్నా, ఖండింత దలచుకున్నా, చర్య తీసుకోదలచుకున్నా సంపాదకుడి మీదనే తీసుకోవాలి. అంతేకాని ఎవరినో బెదరించడం అనాగరికమేగాదు, అహం కార పూరితంకూడా!

ఆ వార్త సుంకరరామశర్మ వ్రాసి



వట్లు జమీన్‌రైతు రామమూర్తి చెప్పా డని ఆమె అన్నదట. ఇంతకంటే అబద్ధం, మోసం, దగా ఇంకొకటుండదు. ఆమె ఎంత విజాయితీపరురాలైంది అందనా వేయడానికి ఈ ఒక్క అబద్ధం చాలు. ఆమె ఎవరో మాకు తెలియదు. ఆమె ముఖం ఎట్లావుంటుందో మేము చూడ లేదు. ఒక నారీరత్నం కొత్తగా కావలి రాజకీయాలలో వె ల సి ఝుమాయించి తిరుగుతూ, అధికార అనధికారదేత దబా యించి పనులు చేయించుకుంటున్నదని వి న్నా మే కా ని ఆమె పేరుకూడా తెలియదు. విశ్వోదయ హై స్కూ లు లో కాబోలు పనిచేసే ఒక అధ్యాపకుని అ ర్ధాం గి అని మాత్రం విన్నాము. ఒక టీ చ రు స తీ మ ణి ఇంత స్వల్పకాలంలో ఇం త గా వెలుగులోకి ఎలావచ్చిందో, ఇంత పలుకుబడిని ఎట్లా సంపాదించిందో, తానే చెప్పుకున్నట్లు యాభై వేల జనాభాకు సుపరిచితురాలు ఎట్లా అయిందో తెలుగుదేశీయులకే తెలి యాలి.

అమ్మా, మీరు ద బా యిం చ దలచు కుంటే మమ్ము దబాయించండి; లేవలేని శర్మనుకాదు! ★

### నామినేషన్ గొడవలు

(4 వ పేజీ కొరవ)

తర్వాత వీటన్నింటికి టెం డ ర్లు పిల్చారు. (టెండరునోటీసు నెం బ రు 20/86-87) వీటిలో పైదేరు పట్టర పనిమాత్రం మినహాయించారట. అంటే ఎస్. ఇ. రద్దు ఉత్తర్వును కూడా ఖాతరు చేయలేదన్నమాట. 80 వేల రూపాయల విలువచేసే ఈ పనిలో పాతికశాతం పని కూడా జరగలేదని, బిల్లుమాత్రం పూర్తి మొత్తానికి సిద్ధమైవుందని చెప్తున్నారు.

మిగతాపనులకుకూడా నా మి నే ష న్ను స్వీకరించినవారుతప్ప, ఇతరకాంట్రాక్టర్ లెవరూ టెం డ ర్లు దాఖలుచేయకూడదని ఇ. ఇ. ప్రతిడిచేస్తున్నట్లు వదంతిగావుంది.

ఒక ఉన్నతాధికారి టెండర్లు వేయ వద్దని కాంట్రాక్టర్లకు ఆ దే శా లు జారీ చేస్తున్నాడంటే, ఇక నెల్లూరు పి డబ్ల్యు డి అధికార్లు ఎంత బ రి తె గిం చి పో యి వు న్నా రో అర్థంచేసుకోవచ్చు. సిండి కేట్‌గా పేరుపడిన కొందరు ఎమ్మెల్యేల అండ వీరికి వుందట, అందువల్లనే ఇంత విశృంఖలంగా వ్యవహరిస్తున్నారట.

నెల్లూరు పిడబ్ల్యుడిలో ఒక్క ఇంజ నీరు, ఒక వి భా గం అనే తేడాలేదు: అంతటా ఇటువంటి కుం భ కో ణా లు, గోల్మాల్ వ్యవహారాలు నిరాటంకంగా, నిర్భయంగా జరిగిపోతున్నాయి. తెలుగు దేశం ప్రభుత్వం మాటలు చెప్పినట్లు నిజంగా అ వి నీ తి ని, అవినీతిపరులను దండించేదైతే, తక్షణం ఇటువంటి అక్ర మాలపై దర్యాప్తు జరిపించాలి; దోషు లను శిక్షించాలి.

### పంచాంగం

**మఘ కార్తె**

30-8-86 వ తేది శనివారం రాత్రి 9-37 గంటలవరకు మఘకార్తె వుండును

**ఆగస్టు తిథులు**

23 శని చవితి రా. 9-40 గం. వ.
24 ఆది పంచమి రా 10-10 ,,
25 సోమ షష్ఠి రా. 11-11 ,,
26 మంగళ సప్తమి రా. 12-44 ,,
27 బుధ అష్టమి రా. 2-28 ,,
28 గురు నవమి తె. 4-29 ,,
29 శుక్ర దశమి పూర్తి.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి

39 వ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భముగా నెల్లూరు బారెక్సులోని ప్రభాత్ ఇంగ్లీషు మీడియం స్కూలులో పతాకావి ష్కరణ గావించిన హోటల్ మురళీకృష్ణ ప్రొప్రయిటర్ శ్రీ గ్రోను గోపాలయ్య. ప్రక్కన ప్రిన్సిపాల్ వై. వి. కృష్ణ; విద్యార్థినీ, విద్యార్థులు.

# గ్రామ పంచాయతి కార్యాలయము, కోవూరు, నెల్లూరుజిల్లా

## టెండరు నోటీసు

ROC No. 59/86 తేది 19-8-86

నెల్లూరుజిల్లా కోవూరు గ్రామపంచాయితీకి ఈ క్రింద చూపబడిన పనుల నిర్వహణ నిమిత్తము సీల్డు టెండర్లు తేది 5-9-86 శుక్రవారము మధ్యాహ్నము 3 గంటల వరకు స్వీకరించబడును. అదేరోజు హాజరయిన టెండరుదార్ల సమక్షమున 3-30 గం||కు టెండర్లు తెరువబడును. టెండరుదారు ప్రతి అయిటమునకు ఎదురుగా చూపబడిన రూ.ల డిపాజిట్టు తేది 4-9-86 లోగా చెల్లించి సదరు రసీదు టెండరుకు జతపరచవలెను. టెండరుకు సంబంధించిన ఇతర షరతులు వివరములు ఆఫీసు పనిదినముల వేళలలో తెలుసుకొనవచ్చును.

గమనిక :- ప్రతి టెండరుదారు ప్రస్తుత సంవత్సరములోని సాల్వెన్సీ సర్టిఫికేటు రు. 15000/- లకు తక్కువకాకుండా డిపాజిట్టు కట్టుటకు రెండు రోజుల ముందుగా దాఖలు చేయవలయును.

| వ. నం. | పని వివరము | ఎస్టిమేటు మొత్తం | చెల్లించ వలసిన ధరావత్తు | పూర్తి చేయు కాలం |
|---|---|---|---|---|
| 1) | ఇసుక దిబ్బల శ్మశానమునకు ప్రహరీ గోడ నిర్మాణము (బిట్ 1) | రూ. 20000/- | రూ. 1000/- | 3 నెలలు |
| 2) | ఇసుకదిబ్బల శ్మశానమునకు ప్రహరీగోడ నిర్మాణము (బిట్ 2) | 20000/- | 1000/- | .. |
| 3) | అలహరి సుబ్రమణ్యం యింటివద్ద నుండి జి. ఎన్. టి. రోడ్డువరకు సైడుకాలువ నిర్మాణము | 16500/- | 825/- | .. |
| 4) | మంగలి వీధిలో సైడుకాలువ నిర్మించుట | 15300/- | 765/- | .. |
| 5) | జి.ఎన్.టి. రోడ్డు నుండి కొత్తూరు రామ మందిరం రోడ్డువరకు రోడ్డు రిపేరు చేయుట | 13500/- | 675/- | .. |
| 6) | జనతా రైసుమిల్లు నుండి పి. కోటా రెడ్డి ఇంటి వరకు సైడుకాలువ నిర్మించుట | 13000/- | 650/- | .. |
| 7) | పి. నరసారెడ్డి యింటినుండి జనతా రైసు మిల్లు వరకు సైడుకాలువ నిర్మాణము | 13000/- | 650/- | .. |
| 8) | కొత్తూరు రామమందిరం రోడ్డులో బాటన కాలువకు ఆర్.సి సి. కల్వర్టు కట్టుట | 12000/- | 600/- | .. |
| 9) | యిండ్ల రమణయ్య యింటి నుండి కొత్తూరు రామమందిరం వరకు రోడ్డురిపేరుచేయుట | 10000/- | 500/- | .. |
| 10) | శీలంశెట్టి యానాదమ్మ యింటి నుండి మార్కెట్టు దగ్గర బావి వరకు సైడు కాల్వ నిర్మించుట | 10000/- | 500/- | .. |
| 11) | అలహరి మస్తానయ్య యింటి నుండి పంట కాలువ వరకు రోడ్డు వేయుట | 10000/- | 500/ | .. |
| 12) | జి. ఎన్. టి. రోడ్డు నుండి ఎల్. వెంకటాచలం యింటి వరకు కోనేటి కయ్యలులో సైడుకాలువ నిర్మించుట | 10000/- | 500/- | .. |
| 13) | ఎస్.నర్సయ్య ఇంటినుండి (హరిజనవాడ) జి ఎన్.టి. రోడ్డు వరకు గ్రావెల్ వేయుట | 9700/- | 485/ | .. |
| 14) | గొల్ల రంగనాయకుల వీధినుండి జంగంవీధి వరకు సైడుకాలువ నిర్మించుట | 9600/- | 480/- | .. |
| 15) | కొత్తూరు రామమందిరం రోడ్డునుండి ఏకేటి రామలింగయ్య యింటివరకు సైడుకాలువ నిర్మించుట | 9600/- | 480/- | .. |
| 16) | వీరపురెడ్డి నరసారెడ్డివీధిలో కాలువ రిపేర్లు | 8900/- | 445/- | .. |
| 17) | శాంతినగర్ నుండి జంగంవీధిని కలుపుచూ గ్రావెల్ రోడ్డు వేయుట | 8800/- | 440/- | .. |
| 18) | తిక్కవరపు రైసుమిల్లు నుండి పారటూ రోడ్డు వరకు మెటల్ వేయుట | 8700/- | 435 | .. |
| 19) | గాంధీ రైసుమిల్లు నుండి జి.ఎన్.టి రోడ్డు వరకు గ్రావెల్ వేయుట | 8500/- | 425/- | .. |
| 20) | మునిరత్నం ఇంటి నుండి పంగిడి చేలు వరకు గ్రావెల్ వేయుట | 8500/- | 425/- | .. |
| 21) | మండలయం నుండి దేసూరివారి వీధి వరకు మెటలురోడ్డు వేయుట | 8400/- | 420/ | .. |
| 22) | దేసూరివారివీధినుండి ఆత్మకూరి రైసు మిల్లు వరకు మెటలురోడ్డు వేయుట | 8000/- | 400/- | .. |
| 23) | ఏకేటి నర్సయ్య ఇంటి నుండి ఏకేటి సుబ్బరామయ్య ఇంటి వరకు సైడుకాల్వ నిర్మాణం | 7200/- | 360/- | .. |
| 24) | రాళ్లమిట్టతొట్టినుండి గొల్ల సుబ్బయ్య మఠం వరకు మెటలురోడ్డు వేయుట | 7000/- | 350/- | . |
| 25) | కొత్తూరుహరిజనవాడలో మెటలురోడ్డువేయుట | 7000/- | 350/- | . |
| 26) | 5 వార్డు మసీదు సెంటరు నుండి మన్నెం వెంకయ్య ఇంటివరకు రోడ్డురిపేరుచేయుట | 7000/- | 350/- | ., |
| 27) | వీరపురెడ్డి నరసారెడ్డివీధిలో కాలువరిపేర్లు (బిట్ 1) | 6700/- | 335/- | .. |
| 28) | ములుముడి రామచంద్రారెడ్డి ఇంటి నుండి (శాంతినగర్) పి. నారాయణరెడ్డి ఇంటి వరకు గ్రావెల్‌రోడ్డు వేయుట | 6700/- | 335/- | .. |
| 29) | కవరగిరి రామయ్యఇంటినుండి తిరువీధి గోవిందయ్య ఇంటివరకు సైడుకాల్వ నిర్మాణం | 6100/- | 305/- | .. |
| 30) | హరిజనవాడలో కువ్వర మాలకొండయ్య ఇంటినుండి ఎలిమెంటరీ పాఠశాల వరకు గ్రావెల్‌రోడ్డు వేయుట | 5500/- | 275/ | .. |
| 31) | కొత్తూరు రామమందిరంనుండి పి. చంద్రారెడ్డి ఇంటిమీదుగా కొత్తూరు హరిజనవాడ వరకు మెటలురోడ్డు వేయుట | 5500/ | 275/- | .. |
| 32) | కోవూరు హరిజనవాడలో ఎస్.పి. ఆంజనేయులు ఇంటినుండి ఎలిమెంటరీ స్కూలు వరకు గ్రావల్ వేయుట | 5400/- | 270/- | .. |
| 33) | దేవిరెడ్డి పోలిరెడ్డి ఇంటినుండి (శాంతినగర్) శిద్దారెడ్డి రమణారెడ్డి ఇంటివరకు గ్రావల్ రోడ్డు వేయుట | 5000/- | 250/- | .. |
| 34) | మోడెం చంద్రారెడ్డి వీధిలో సైడుకాలువ రిపేర్లు మరియు గ్రావెల్ వేయుట | 5000/- | 250/- | .. |
| 35) | తుంగావారివీధిలో గ్రావల్ వేయుట | 4900/- | 245/- | .. |
| 36) | దేసూరివారివీధిలో మెటలురోడ్డువేయుట | 4000/- | 200/- | .. |
| 37) | సిరిసాకలపాలెంలో గ్రావెల్‌రోడ్డువేయుట | 4000/- | 200/- | .. |
| 38) | లక్ష్మీనగర్ టి. రాఘయ్యఇంటినుండిమురికి కాలువ నిర్మించుట | 3500/- | 175/- | .. |
| 39) | సాయిబాబా మందిరంవీధిలో మురికి కాల్వ నిర్మించుట | 3500/ | -175/- | .. |
| 40) | శాంతినగర్‌లో అన్నపల్లి వెంకురెడ్డి ఇంటికి తూర్పువీధి గ్రావెల్‌వేయుట | 3500/- | 175/- | .. |
| 41) | దేసూరివారి వీధిలో మురికికాల్వ రిపేరు చేయుట | 3300/- | 165/- | .. |
| 42) | కన్నంరెడ్డి గోపాలరెడ్డి వీధిలో గ్రావెల్ చేయుట | 3100/- | 155/- | .. |
| 43) | సాయిబాబా మందిరంవీధి నుండి కొళాయి బావివీధి గ్రావెల్‌చేయుట | 3100/- | 155/- | .. |
| 44) | శాంతినగర్‌లో కోటారెడ్డిఇంటి ఎదురువీధిలో గ్రావెల్‌రోడ్డు వేయుట | 3000/- | 150/- | .. |
| 45) | పర్వతాల సుందరరామిరెడ్డిఇంటి ఎదురు వీధిలో (శాంతినగర్) గ్రావెల్‌రోడ్డువేయుట | 3000/- | 150/- | .. |
| 46 | కాటంరెడ్డి రామిరెడ్డిఇంటి నుండి ఇసుకల దిబ్బవరకు మెటలురోడ్డు వేయుట | 2900/- | 145/- | . |
| 47) | తుంగావారివీధిలో సైడుకాలువ నిర్మించుట | 2700/- | 135/- | .. |
| 48) | గవళ్లపాలెంవీధి గ్రావెల్‌వేయుట | 2700/- | 135/- | .. |
| 59) | మన్నెమాలవారివీధిలో రోడ్డురిపేరుచేయుట | 2700/- | 135/- | .. |
| 50) | శాంతినగర్‌లో కె. వెంకురెడ్డిఇంటినుండి పి. పరంధామిరెడ్డి ఇంటివరకు గ్రావెల్ రోడ్డు వేయుట | 2400/- | 120/- | .. |
| 51) | బ్రాహ్మణ వీధిలో చేజర్ల పిచ్చయ్య ఇంటి నుండి సీతారామయ్యపాఠశాలవరకు మెటల్ రోడ్డు వేయుట | 2200/- | 110/- | .. |
| 52) | చాకలివీధిలో గ్రావెల్‌రోడ్డు వేయుట | 2200/- | 110/- | .. |
| 53) | కొత్తూరు పి. చంద్రారెడ్డి ఇంటినుండి పడమరవైపు మెటల్‌రోడ్డు వేయుట | 2100/- | 105/- | .. |
| 54) | గౌరిశంకర్ ఇంటినుండి పంటకాలువ వరకు సైడుకాలువ నిర్మించుట | 4500/- | 225/- | .. |
| 55. | కోనేటికయ్యలులో L F డిస్పెన్సరీ నుండి L. వెంకటాచలంఇంటివరకు గ్రావెల్‌రోడ్డు వేయుట | 3000/- | 150/- | . |
| 56) | GNTరోడ్డునుండి (PR కాలనీ) రత్నాకర్‌రెడ్డిఇంటివరకు గ్రావల్‌రోడ్డువేయుట | 3000/- | 150/- | .. |
| 57) | GNTరోడ్డునుండి శ్మశానంవరకు మెటలు రోడ్డు వేయుట | 6200/- | 310/- | .. |

—తరువ 12వ పేజీలో



## సవరణ

1-8-86 తేది పేపరు 10వ పేజీ 1వ కాలంలోని నీలిశెట్టి సత్యనారాయణ గారి ప్రకటనలో 29-7-88 అని తేది తప్పుగాపడ్డయినది. దానిని29-7-86 అని చదువుకోవలెను.

—మేనేజరు.

నెల్లూరు 4వ అ. డి. ము. కోర్టులో

O, S. No. 207 of 86

దేవకి హరిప్రసాదు -వాది

మాలేపాటి రామప్రసాదు -ప్రతివాది

ఈ నెంబర్ను వాదిపేరటికి ప్రతివాది వ్రాసియిచ్చియుంచే ప్రోనోటువాకీకిగాను దావాచేసి మరియు I. A. No. 247 of 86 చరాస్థిని జప్తి చేయమని కోరుచు పిటీషనుసహా పెట్టియున్నందున ప్రతివాదికి నోటీసు నిమిత్తం దావాలోనున్నూ పిటీషనులోనున్నూ 25-8-86 తేదిన ఉ 10-30 గం. వాయిదా వేయబడివున్నది ప్రతివాది హాజరు కానియెడల ఏకపక్షమున తీర్మానించబడును.

-చింతా శ్రీరామమూర్తి
వాది తరపు అడ్వకేటు

## జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | 50-00 |
| అర్థ సంవత్సరం చందా | 26-00 |

విడి ప్రతి 1-00

# కొత్త హీరోల విజయంతో పాతవారి గుండెల్లో గుబులు

బాలకృష్ణ నటించిన "ముద్దుల మావయ్య" గారి అల్లుడు, 'దేశోద్ధారకుడు' చిత్రాలు హిట్ అయ్యాయి. కళ్యాణ చక్రవర్తి నటించిన "అత్తగారూ స్వాగతం" చిత్రం కూడా బాగాబాగా ఆడుతోంది. వెంకటేశ్ నటించిన "కలియుగ పాండవులు" కూడా హౌస్‌ఫుల్ కలెక్షన్లతో ప్రదర్శింపబడుతోంది. ఈ యువహీరోల చిత్రాలు ఇంత విజయవంతమవడంతో శోభన్ బాబు, చిరంజీవి వంటి హీరోలు బెదిరిపోతున్నారు. వీరి ముఖాలలో విషాదచ్ఛాయలు బాగా అలముకొని వుంటున్నాయి. దానికితగ్గట్టు ఇప్పుడొచ్చే కొత్త కొనుగోలుదారులలోకూడా ఎక్కువగా యువకులే మద్రాసుకు వస్తున్నారు. వీళ్ళు యువహీరోల చిత్రాలనే కొనుగోలు చేయడానికి ఉబలాటపడటంతో అసహజమేమీలేదు.

మూలిగేనక్కమీద తాటికాయ పడ్డట్టు ఈ హీరోలకు ఇంకో భయం పట్టుకుంది. సెప్టెంబర్‌లో హీరో కృష్ణ తన కొడుకు

### సినిమా

రమేష్‌బాబును హీరో చేస్తున్నారు. హీరోయిన్ ఎవరో ఇంకా నిర్ణయమవకముందే ఈ చిత్రానికి కొన్ని ఏరియాలు అప్పుడే అమ్ముడయిపోయాయి! కృష్ణ కొడుకు కూడా అక్కినేని కొడుకు నాగార్జునవలె అమాంతంగా హిట్ అయిపోతే, ఇక తమ దగ్గరికి ఏ నిర్మాత వస్తారు?

ప్రేక్షకులలోకూడా కొత్తతనం వచ్చేసింది. వీళ్ళంతా తమ సమవయస్కులయిన యువతరం హీరోల చిత్రాలకే ఎగబడతారు తప్పదు.

మొత్తమ్మీద యువతరం హీరోలతో తెలుగు చలనచిత్ర పరిశ్రమలో చాలా గొప్పమార్పు రాకతప్పదు.

### డాక్టర్ తిరుపతిరెడ్డి చిత్రంలో వెంకటేష్

"రాజావీట్టు మగన్" అనే మళయాళ హిట్ చిత్రాన్ని తెలుగులో నిర్మించే హక్కులను సంయుక్తా మూవీస్‌వారు కొన్నారు. ఈ చిత్రంలో నిర్మాత డి. రామానాయుడి కొడుకు వెంకటేశ్ హీరో, త్వరలోనే దర్శకుణ్ణి, మిగతా వారిని బుక్ చేయనున్నారు.

# తారల ఇళ్ళపై ఆదాయపుపన్ను దాడులు

దేనికైనా తృప్తి అనేదివుండాలి. "నటులలో నాకున్నంత మనశ్శాంతి ఎవ్వరికీ లేదు," అని విర్రవీగుతుండేవాడు శోభన్ బాబు. ధనదాహమున్నవారికి మనశ్శాంతి ఎట్లాఉంటుంది? ఇటీవల ఆదాయపుపన్ను శాఖవారు శోభన్ బాబు నివాసంమీద, ఆయనకు సంబంధమున్న గృహాలు, కార్యాలయాలపై అకస్మాత్తుగా దాడి చేశారు. ఎంత జాగ్రత్తగా దాచిపెట్టినా-ఎంతో కొంత దొరక్కమానదు. దాంతో మనశ్శాంతి లేకుండాపోతోంది. "ఎంత కష్టపడి సంపాదించినా-ఫలితం లేకుండా పోతోంది. త్వరలోనే నేను రిటైర్ అయిపోతాను." అని పాత్రికేయులతో చెప్తున్నారు. ఇదివరకుకూడా రెండు మూడు సార్లు ఇట్లా ప్రకటనలు చేశాడు. కాని, నటిస్తూనే వున్నాడు. వరుసగా నాలుగైదు పిక్చర్లు ఫ్లాప్ అయి, డిమాండ్ బాగా తగ్గేవరకు నటిస్తూనే ఉంటారు కొందరు, డిమాండ్ తగ్గాక తండ్రి వేషాలు కూడా వేస్తున్నారు. కాంతారావులాంటి అలనాటి హీరోలు,

రాధ, అంబికల తల్లి సరసాంబ కేరళలో పలుకుబడిగల మహిళ. ఇందిరా గాంధీకి స్నేహితురాలు. ఇప్పటికీ కాంగ్రెస్-ఐ తరపున పనిచేస్తూనే ఉంది.

### చిత్రవార్తలు
★
మా మద్రాసుసినీ ప్రతినిధి

అందేత తన కుమార్తెల ఆస్తిపాస్తులపై ఆదాయపుపన్ను శాఖవారు దాడి చేయరన్న ధైర్యంతో ఉండిపోయింది. కన్న కుమార్తెల ఆరోగ్యం గురించి పట్టించుకోకుండా రాత్రింబవళ్ళు వాళ్ళు షూటింగ్‌లలో పాల్గొనేలా కాల్‌షీట్లు ఇచ్చింది. ఆ డబ్బు చాలక వాళ్ళ బంగళాలో మినీ స్టూడియోలాంటివి కట్టించి, అద్దెకు ఇస్తోంది. ఇటీవల ఆ తారల గృహాలపై కూడా ఆదాయపుపన్ను శాఖవారు దాడి చేశారు, లెక్కకురాని సొమ్మెంతో కనుగొనబడింది.

ఈ దాడులతో మిగతా తారలుకూడా నల్లధనం విషయంలో జాగ్రత్త పడ్డారు. ఎంత జాగ్రత్త పడ్డా తృప్తి అనేది లేనంత వరకు వాళ్ళపైకూడా దాడులు తప్పవు.

### పెళ్ళకూరువారి చిత్రం "చిలిపి దంపతులు"

పెళ్ళకూరు అమరేంద్రరెడ్డి. బి. ఎ., బి. ఎల్., హరిత చిత్ర మూవీస్ పతాకంలో "చిలిపి దంపతులు" చిత్రాన్ని నిర్మించబోతున్నారు. ఈ హాస్య చిత్రానికి పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగిందికూడా, చంద్రమోహన్ అశ్వని, నూతన్‌ప్రసాద్, వేలు, వీరభద్రరావు, వై. విజయ, నిర్మల నటిస్తారు. కథ, మాటలు; దివాకర్‌బాబు. ఎస్. రాజేశ్వరరావు పుత్రుడు ఎస్ వాసూరావు ఈ చిత్రానికి సంగీతమిస్తున్నారు. పాటలు: ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, సిరివెన్నెల సీతారామశాస్త్రి. నిర్వహణ; ఎ. జగన్మోహనరెడ్డి, బి. ఎ,; బి, ఎల్. సహనిర్మాత: పెళ్ళకూరు వెంకటహరీష్, దర్శకత్వం: రేలంగి నరసింహారావు.

ఆగస్టు 7 న విజయ డీలక్స్ థియేటర్‌లో "కొమ్మల్లో కోయిలమ్మా- కోరేది ఏమిటమ్మా." అనే పాటను ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల పాడగా రికార్డ్ చేశారు.

### రామోజీరావు కొత్తచిత్రం "పూజకు పనికిరాని పువ్వు"

ఎవ్వరూ సాహసించని ఇతివృత్తాలను ధైర్యంతో నిర్మించి తన ప్రత్యేకతను ఎప్పటికప్పుడు నిలబెట్టుకుంటూ వస్తున్నారు 'ఈనాడు' పత్రికాధిపతి చెరుకూరి రామోజీరావు. ఈయన నిర్మించే ఉషాకిరణ్ మూవీస్ కొత్తచిత్రం "పూజకు పనికిరాని పువ్వు" వ్యభిచారిణులకు సంబంధించినది. దారితప్పిన వనితలను ఉద్ధరించే బాధ్యత ప్రతివారిపైనావుందని ప్రబోధించే చిత్రం. ఈ చిత్రాన్ని చూస్తే వ్యభిచారాన్ని ప్రోత్సహించే చాలామందికి కాస్తంతైనా కనువిప్పు కలుగుతుంది.

—కొరవ 11వ పేజీలో







'ధర్మపీఠం దద్దరిల్లింది' లో శోభన్‌బాబు, జయసుధ

# వేమనను దేవుణ్ణిచేసి ఘోరంగా ఖూనీచేశారు
# శ్రీ వేమన చరిత్ర

"వేమన చరిత్రలో వేమన లేడు" అని గతవారం ఇమేజ్ రైతు సినీవిలేఖరిఅన్నది అక్షరసత్యం. ఈచిత్రంలో మనకు కనిపించేది మంత్రతంత్ర విద్యలునేర్చి, కళ్ళులేని ముదుసళ్ళకు చూపుతెప్పించే అవతారపురుషుడు, మహిమాన్విత స్వరూపుడు మాత్రమేకాని వేమన కానే కాదు. దేవుడు లేడనే నాస్తికుడైన వేమన్నకు మనప్రజలు ఏకంగా గుడికట్టి, దైవంగా కొలుస్తుంటే, దర్శకుడు సి. ఎస్. రావు వేమనముందు 'శ్రీ' నిచేర్చి ఆయనకు దైవత్వాన్ని అపాదించవేసి, చరిత్రనే తప్పుదోవ పట్టించడం దురదృష్టకరం,

చరిత్రకారుడికి తెలిసిన వేమన ప్రజాకవిమాత్రమే! తనకాలపు పరిధి దాటి సామాజిక చైతన్యదృష్టితో కవిత్వం చెపుతూ, ప్రమళక్తికేతనాన్ని ఎగురవేసిన అనమాన్యకవి వేమన. ఏ కోణంనుంచి చూచినా, పరిశీలించినా కవిగాతప్ప మరే విధమైన గొప్పతనం ఆయనలో కనిపించదు. అలాంటివ్యక్తిచుట్టూ ప్రచారంలో వున్న కథల్ని త్రోసిరాజని, మరోకథతో చేసిన అసంబద్ధ ప్రయత్నం ఈచిత్రం,

మన్నవ రాసిన మరో ఈ కల్పిత కథలో—ఓ మామూలువేశ్య "విశ్వద". వేమనను మార్చేయత్నంలో త్యాగశీలిగా ఉదాత్తంగా వ్యవహరిస్తుంది; అంతటి గొప్పవనిత ఆమె. వేశ్య అయినాకూడా, పేదవాడి పేగుశబ్దాన్ని వినగల్గిన ఉదయభానుడు, కరుణామయుడు అయిన వేమన్నను విశ్వదకే మిగుల్చుకుంటావో, విశ్వానికే దక్కించుకుంటావో అని అభిరామయ్య అన్నమాటల్తో చలించి తన ప్రేమను త్యాగంచేసిన 'విశ్వద' లో మహోన్నతి కన్పిస్తుంది. ఇది చరిత్ర చెప్పిన కథనం వేమన విశ్వదను నగ్నంగాచూసి అసహ్యించుకున్నాడే కాని, విశ్వద తననసహ్యించుకునేటట్లు ప్రవర్తించిన దాఖలాలులేవు. ఈ సన్ని

### చిత్రసమీక్ష
సి. నారాయణరావు

వేశంలో వేమన పాత్ర వెలితిపడ్డది. భోగియైన వేమన యోగిగా మారడంలో అపాత్ర తలాచలడినట్లుచేయడం, అపాత్రకు పెద్దదెబ్బ ఘాతం కల్పించినట్టయిందేని దర్శకుడు ఊహించినట్లు గొప్పదనం లభించలేదు ఈ అభూత కల్పన క్షంతవ్యం కానేరదు! ఇదినేరం ఘోరం.

అలాగే ఈచిత్రంలో మధ్యయుగం నాటి వాతావరణం, ఆకాల పరిస్థితులు కాగడాపెట్టి వెతికినా కన్పించవు. సాదా సాంఘిక చిత్రంలోవలె వేగంగా సాగే సన్నివేశాలు, చక్కని నృత్యాలు, ఆకర్షణీయమైన మాటలు, పాటలుతప్ప ఈ చిత్రంలో వున్నది చరిత్రలోని వేమన కాదు, ఆధునిక వేమన అని దర్శకుడు కథలు చెప్పినట్లుంటే, ఈచిత్రం హృద్యంగా వుందని మనం ప్రశంసించగలం కాని

—కొరవ 11వ పేజీలో

నెల్లూరు ఫైనాన్సు కార్పొరేషన్
నెల్లూరు

## సవరణ

8-8-86 జమీన్‌రైతు 3వ పేజీలో అంటించిన కార్డ వేలం ప్రకటనలో AAN 9072 కు బదులు APN 9072 అని పొరపాటు ప్రకటన జరిగినది. ఈ సవరణను గమనించగోరుతాము.



వోజిలి గ్రామ పంచాయితీ

## టెండరు నోటీసు

ఓజిలి మండలం, ఓజిలి గ్రామ పంచాయితికి, దిగువ తెల్పిన వస్తువులు సరఫరా చేయుటకు సీల్డు టెండర్లు కోర బడుచున్నవి. తగిన డిపాజిట్ చెల్లించి 1-9-1986 తేది మధ్యాహ్నం 3 గంటలలోగా టెండర్లు దాఖలుచేయాలి. అదేరోజు సాయంత్రం 4 గంటలకు హాజరైన టెండరుదారుల సమక్షములో తెరువబడును. మిగతా వివరములు ఆఫీసు పనిచేయు వేళలలో తెలుసుకో వచ్చును.

వ. నం 1, 4' ట్యూబ్‌లైటు సెట్టు ఫిక్చర్లు, ఇతర అన్ని విడిభాగములతో కలసి, 6 నంబర్లు (క్రాంప్టన్ అథరైజ్డు డీలర్లు మాత్రమే అర్హులు)
డిపాజిట్ రు. 25/-లు

వ.నం. 2. పి.డబ్ల్యు. వర్క్సు కు చెందిన మోటారు స్టార్టర్, 1 నం.
డిపాజిట్ రు. 25/-లు

వ.నం. 3. పంచాయితీ ఆఫీసుకు సీలింగు ఫ్యాను 1 నం.
డిపాజిట్ రు. 25/-లు

—వల్లూరు ఇందిర-సర్పంచ్

ఒంగోలు డి॥ము॥ కోర్టులో

O. S. 1024/73

E. P. 249/84

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఒంగోలు —డి హో.

కాటా నారాయణమ్మ వగైరాలు-జే.డి.లు

సేల్ ఇస్తిహారు షెడ్యూలు ఆఫ్ జే.డి.ల ప్రాపర్టీ మద్దిపాడు మండలం వెలటూరు గ్రామం.

| | | |
|---|---|---|
| సర్వే నం. | 276/1 | య 1-32 |
| | 280/1 | 1-72 |
| | 278 | 0-03 |
| | 277/1 | 0-75 |
| | మొత్తం | య 3-82 టు |

హద్దులు : తూ) దుంపా పేరారెడ్డి వగైరా ద) జే.డి.లు వాలూకు యితర నంబర్ల ని భూమి ప) డొంక కొంత వరకు, కంది చెన్నారెడ్డి భూమి ఉ) మేకల సుబ్బరామరెడ్డి కొట్టు డిక్రీ విక్రయ భూమి

Date of Sale 29-9-86
Further Hearing 3-10-86

డి.హో. వాల్యు రు. 16000/-
అఫీనా వాల్యు రు. 20000/-
జే. డి. ఆర్.లు నిల్

—ఎస్. హనుమయ్య చౌదరి
డి హో. అడ్వొకేటు-ఒంగోలు

## పినాకినీతీరం

( 2వ పేజీ తరువాయి)

కాలో కూడా పర్యటించినట్టుంది, జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడు నెల్లూరులో జెండా ఎగురవేసి సరిపెట్టుకున్నట్టు జనార్దనరెడ్డికూడా వాకాడులో తలాకావిష్కరణం గావించి పూరుకుండిపోతే సరిపోయి వుండునుగదా: ఆ ఎర్రని ఎండలో చెమటలు కారుస్తూ తిరగడమెందుకు? ఆయనకు సంస్థలో ఎక్కడా ఏ చిన్న పదవిలేదే? కాని కాంగ్రెస్‌కు భవిష్యత్తు వుంటే తనందరికీ భవిష్యత్తు; అది లేకుంటే తామెక్కడుంటారు? ఆ ధర్మసూక్ష్మం గ్రహించిన బాధ్యతగల కాంగ్రెస్‌వాది కాబట్టి ఎవరు కలిసి వచ్చినా ఎవరు రాకపోయినా తానొక్కడుగా జనార్దనరెడ్డి జిల్లాలో కాంగ్రెస్ పునరుజ్జీవనానికి పూనుకున్నారు. పోయిన చోటంతా కాంగ్రెస్‌వాదుల వుత్తేజం, ప్రజల వుత్సాహం చూస్తుంటే జనార్దనరెడ్డి ప్రారంభించిన పర్యటన అత్యంత ప్రయోజనకరమైనదనిపిస్తుంది. కాంగ్రెస్‌వాదులు పనిచేయనందువల్ల కాంగ్రెస్ బలహీనంగా కనపడుతున్నది కాని. నిజంగా దానికి ప్రజలలో పట్టుపోలేదని జనార్దనరెడ్డి పర్యటనలవల్ల విదితమవుతున్నది.

పదవిని ఒకరిచ్చేగలరుగాని, నాయకత్వమనేది ఒకరిస్తే వచ్చేదికాదు; వచ్చినా నిల్చేదికాదు. జిల్లాలో కాంగ్రెస్‌కు సంబంధించినంతవరకు ఈనాడు జనార్దనరెడ్డి సహజ నాయకుడు కాబట్టి, నేరుగా ప్రజలలోకి దూసుకపోగలుగుతున్నారు; కాంగ్రెస్ పునర్దర్శింపజేయగలుగుతున్నారు. కాంగ్రెస్‌వాదులు పూర్వంకంటే పదింతలు సమైక్యతతో మెలగి, ఇరవైరెట్లు కష్టపడి పనిచేయగలిగితేనే నేడు తెలుగుదేశం సవాలును ఎదుర్కొనడానికి వీలవుతుంది. లేకుంటే అధికారంరాలేదు. ఈ పరిణామసమయంలో జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడు, శాసనసభ్యులు, ఇతర పెద్దలు అందరూకలిసి కాంగ్రెస్ పూర్వ ప్రాభవానికి కృషిచేయడం బాగుంటుంది. ఇందులో జిల్లాకాంగ్రెస్ అధ్యక్షతను స్వీకరించిన తన బాధ్యత ఎక్కువనే విషయాన్ని కె. వి. సుబ్బారెడ్డిగారు ఎంతవరకు గుర్తించారోమరి!

## వరకవిపూడి హరిజనుల కాంగ్రెస్ ప్రవేశోత్సవం

ఆగష్టు 15
4వ పేజీ తరువాయి

ఎ. ఎస్. పేట మండల కార్యాలయంలో ఎం. ఆర్. ఓ. శ్రీ బావింటపర్తి కృష్ణరావు జెండా ఎగురవేశారు. ఎమ్మెల్యే డాక్టరు బి. సుందరరామరెడ్డి పట్టాలు పంచారు. రాజవోలు, చవట భీమవరం, చిరమన, కావలి యడవల్లి, అబ్బీపురం, గ్రామస్తులకు 'పట్టా'భిషేకం జరిగింది.

ఆత్మకూరు ఎం ఆర్ ఓ ఆఫీసులో సోమశిల ప్రాజెక్టు స్పెషల్ డిప్యూటీ కలెక్టర్ శ్రీ గణేశన్ అధ్యక్షించారు; సుందరరామరెడ్డిగారు పట్టాలు పంచారు, పాత ఎం ఆర్ ఓ శ్రీ కె. వెంకట్రావు, కొత్త ఎం ఆర్.ఓ. శ్రీ ఎ. సుబ్బారాయుడు మాట్లాడారు.

### నారాయణరెడ్డి పేట

బందుకూరుపేట తాలూకా నారాయణరెడ్డిపేట స్కూలులో బి.డి.ఓ. శ్రీ రామసుబ్బయ్య పతాకం ఆవిష్కరించారు; శ్రీ వెంకట్రావు అధ్యక్షించారు; సర్పంచ్ శ్రీ సుబ్బారావు శ్రీ చిన్నారెడ్డి, శ్రీ రంగారెడ్డి తదితరులు మాట్లాడారు. హెడ్మిస్ట్రెస్ శ్రీమతి కాంతకుమారి నివేదిక చదివారు. టీచర్లు శ్రీ డి. వెంకటరత్నం స్వాగతం, శ్రీ కె. ఆదిశేషయ్య వందనాలు చెప్పారు.

### వరకవిపూడి హరిజన ప్రవేశోత్సవం

స్వాతంత్ర్యోద్యమ కాలంలో హరిజనుల దేవాలయ ప్రవేశం గాంధీగారికి ప్రియమైన కార్యంగా, అభివృద్ధికాముకులైన ప్రజలకు ఒక సవాల్‌గా జరిగేది: మొన్న 15 తేది స్వాతంత్ర్య దినోత్సవంనాడు, బందుకూరుపేట తాలూకా వరకవిపూడిలో ఆనాటి స్మృతులు స్మరింపచేస్తూ హరిజనుల కాంగ్రెస్ ప్రవేశోత్సవం నిర్వహించారు- రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఎన్. జనార్దనరెడ్డి, దాదాపు దశాబ్దంపైన మార్క్సిస్టుల కబంధ హస్తాలలో చిక్కి, బయటపడలేక సతమతమౌతుండిన నేలటూరు, పిడతాపోలూరు. వరకవిపూడి తదితర గ్రామాలకు చెందిన 200 మంది హరిజనులు ఆయన సమక్షంలో కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. అరుదైన విషయమిది.

ఈ సందర్భంగా జరిగిన సభను జి. యు కాం. అధ్యక్షుడు శ్రీ మెట్టా చంద్రశేఖరరెడ్డి అధ్యక్షించారు. శ్రీ సి. వి. శేషారెడ్డి, శ్రీ ఊటుకూరు ఆదిమూర్తి, శ్రీమతి రేబాల దమయంతి తదితరులు మాట్లాడారు. వరకవిపూడి యువజన నాయకుడు శ్రీ ప్రసాదరెడ్డి స్వాగత వందనాలు చెప్పారు. ★

## 50 కోట్లు

(2వ పేజీ తరువాయి)

మన గ్రామసీమలు అభివృద్ధి రాహిత్యంలో తరాలతరబడి మ్రగ్గిపోవడానికి అసలుకారణం సరైన ప్రాథమిక వసతులేవీ లేకపోవడం. కష్టజీవులు తమ ఉత్పత్తులను అమ్ముకోవడానికి సక్రమమైన వసతులే లేవు మనకు. వ్యవసాయోత్పత్తుల సంగతే చూడండి. నెల్లూరు జిల్లాకు కోవూరు జిల్లాకే రెట్లు లేదా; జిల్లాలో 90 శాతం రైతులు కల్లంలోనే పంట తెగనమ్ముకుంటున్నారు. రోడ్లు, గోడౌన్లవంటి వసతులు పల్లెల్లో వుంటే రైతు తన ఉత్పత్తులకు గిట్టుబాటు ధర సంపాదించుకోగలుగుతాడు. అవి లేనందువల్ల వ్యాపారస్థుడు లాభపడుతున్నాడు. చేపలవంటి సముద్రపు ఉత్పత్తులు కాని, చేనేత, హస్తకళల వస్తువులుకాని -వ్యాపారులను లాభాధికారులను చేస్తున్నాయే తప్ప, నిజంగా శ్రమించేవాడికి మేలు జరగడంలేదు. అసలు సక్రమమైనరవాణా సౌకర్యాలే లేవు మనకు.

చెరువులు, దొరువులు సక్రమంగా వుంటే, ప్రకృతి ఆటుపోట్లకు తట్టుకోగలిగి వుంటే, మన వ్యవసాయ ఉత్పత్తులు రెట్టింపుకు పెరుగుతాయి. కాని అది జరగటంలేదు.

అధికారులు వచ్చినప్పుడల్లా అప్పటికప్పుడు ఏదో ఒకపని సృష్టించి వెళ్ళిపోవడంకాక, జిల్లాలో మార్కెటింగ్, నీటిపారుదల రవాణావంటి ప్రాథమిక వసతుల కల్పనకు ఒక మాస్టర్‌ప్లాన తయారుచేయించి, పద్ధతులను దాని కనుగుణంగా ఖర్చుచేస్తే ఎంతో ప్రయోజనం కలుగుతుంది. చేసినపనే తిరిగి చేయవలసిన దుర్గతి తప్పుతుంది. పెట్టిన ఖర్చుకు ఫలితం, చేసినపనికి సార్థకత, గ్రామీణాభివృద్ధికి దోహదం కలుగుతాయి. కలెక్టరు, జాయింటు కలెక్టరు సంయుక్తంగా ఈ కృషి ప్రారంభించడం మంచిది. ★

## జనవాణి

(3వ పేజీ తరువాయి)

జెండాను, జాతీయగీతాన్ని గౌరవించాలని నిర్దేశించి వున్నారుకదా! హక్కు కోసం అడిగేవారికి బాధ్యతలు గుర్తు చేయవలసిన అవసరంలేదా! రాజ్యాంగంలో మొట్టమొదటి పంక్తి- మత ప్రసక్తిలేని సమధర్మ, స్వతంత్ర రాజ్య స్థాపన. మతంకోసం జాతిని, జాతీయ గీతాన్ని ప్రక్కకు పెడితే, ఇక రాజ్యాంగానికి అర్థమేముంది? మతాతీత రాజ్యానికి న్యాయస్థానాలు అడ్డంకులు కల్పిస్తే సెక్యులరిజం లక్ష్యసాధన ఎట్లాసాధ్యం?

లోక్‌సభ ఈ తీర్పును గర్హించి మంచి పని చేసింది. లోక్‌సభేకాదు, జాతిపై గౌరవం కల్గిన ప్రతిపౌరుడు సుప్రీంకోర్టు తన తీర్పును పునః పరిశీలన చేసుకొనే టట్లు చేయడం అవసరం.

నెల్లూరు —బి. వి. రఘురామమూర్తి

## నెల్లూరు సంగతులు

(4 వ పేజీ తరువాయి)

శ్రీ దుగ్గిశెట్టి వెంకటరమణయ్య అధ్యక్షించారు. నెల్లూరు వేదసంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కె. వి. రామానుజాచార్యులు 'స్వప్నమాల' సంస్కృతానువాదం చేశారు. అనంతరం శ్రీ కె. ఎస్. రామానుజాచార్యులు 'ఉత్కళ భాస్కర' అనే బిరుదుతో, మెమొంటోతో డాక్టర్ గోపాలరెడ్డిని సత్కరించారు, కర్త శ్రీ కె. యస్. రామానుజాచార్యులను డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి సన్మానించారు. జిల్లా రిజిస్ట్రారు శ్రీ యం. శంకర శర్మ, శ్రీ అగస్త్య రెడ్డి వెంకురెడ్డి గ్రంథాన్ని సమీక్షించి, కవిగా డాక్టర్ గోపాలరెడ్డిని ప్రశంసించారు.

### జేసుదాస్‌కి 'నెఫ్జా' సన్మానం

మధురగాయకుడు, సినిమా సంగీతంలో జాతీయ అవార్డు పొందిన ప్రఖ్యాతుడు శ్రీ జేసుదాస్‌ను 17 తేది సాయంత్రం నెఫ్జా, టౌన్‌హాలులో ఘనంగా సన్మానించింది. పట్టి సన్మానంకాదు, ఈ సభలోనే ఆయనకు 'గానగంధర్వ' అనే బిరుదప్రదానంకూడా చేశారు.

సభను జిల్లాజడ్జి శ్రీ బి. శివసాంబమూర్తి అధ్యక్షించారు. డాక్టర్ ఎం. సంజీవరావుముఖ్య ఆతిథ్యంవహించారు. డాక్టర్ శ్రీధర్. జేసుదాసుకు సన్మానపత్రమందజేశారు. జేసుదాసు తనకు జరిగిన సన్మానానికి మాటలలోనూ, అవార్డు పొందిన పాటలతోనూ కృతజ్ఞతలు వ్యక్తంచేశారు నెఫ్జా సుందరరామరెడ్డి వందనాలు చెప్పారు

### టెలిఫోన్ ఉద్యోగుల ధర్నా

నెల్లూరు టెలిఫోన్ శాఖకు చెందిన ఉద్యోగులు మొన్న 12 తేది టెలిఫోన్ ఎక్చేంజి డి ఇ టి ఆఫీసుల ఎదుట ధర్నా జరిపారు. సాయంత్రం ఊరేగింపుకూడా జరిగింది. ఎ ఐ టి ఇ సి కార్యదర్శి శ్రీ రామరాజు, తపాలా ఉద్యోగుల నాయకులు డి రామసుబ్బారెడ్డి, పి. నాగభూషణం, టెలిఫోన్ ఉద్యోగుల నాయకులు కె అంజనేయులు, ఎ. అయ్యన్న తదితరులు మాట్లాడారు.

# ** పెండ్లిండ్లు **

### శ్రీ రంగారెడ్డి కుమారుడు

కోవూరు సమితి గిరిజన అభ్యర్థిని నామినేట్ చేసి అసలు అధికారాన్నంతా తానే చెలాయించిన ఉపాధ్యక్షుడు, మంత్రి శ్రీ శ్రీనివాసులురెడ్డికి అన్నయ్య, విశ్వాస పాత్రుడు; కార్యకర్తైన అధికార అనధికార పాలిట కల్పతరువుగా మోత పుట్టించుకున్న పెమ్మారెడ్డిపాళెం వాసి శ్రీ కోడూరు శ్రీ రంగారెడ్డి కుమారుడు, ఎం.ఎ. పట్టభద్రుడు గోపినాథ్‌రెడ్డి; విడవలూరు శ్రీ రేవాల వసంతకుమార రెడ్డి కుమార్తె షీలా పరిణయం 14 తేదీ నెల్లూరు టి.టి.డి. కళ్యాణమండపంలో జరిగింది. ఆహూతుల సంఖ్య అసంఖ్యాకం!

పెళ్లి ఆడంబరం ఎట్లున్నా పెండ్లి కొడుకు స్వంతపిలుపు పత్రికమాత్రం ముచ్చటగావుంది. కమలపాకు ఆకారపు చిన్న కార్డులో మాటల విన్యాసాలతో కూడిన పిలుపు అది. బహుశా అది డాక్టరుగారి సృష్టిగావుంటుంది. సాధారణమైన భావాన్ని అసాధారణమైన పదాలలో చెప్పడం జె.పి. రెడ్డిగారికి సరదా:

**SHEELA IS GOING TO BECOME MY SPOUSE ON THE OCCASION OF MY ESPOUSE... Lucid Sa'utations from: Dr J. P. Reddy.**

ఇదీ వరుని పిలుపు. బాగుంది కదూ!

### బెంగుళూరు - బుచ్చి

స్వస్థానమైన లేగుంటపాడు వదలి బెంగుళూరు చేరి, స్వశక్తితో, స్వయం కృషితో, వ్యాపార దక్షతతో భాగ్యవంతుడై, నగరనాగరికతకుగుర్తుగా కాబోలు పి.వి.కె. రెడ్డి అని పేరును పొట్టి చేసుకున్న సహృదయుడు, సంస్కారశీలి శ్రీ పోలంరెడ్డి వెంకటకృష్ణారెడ్డి తనయ శైలజ (బి.ఎస్‌సి.): బుచ్చిరెడ్డిపాళెం దొడ్ల కుటుంబీకుడు, సౌమ్యుడు; వివాద రహితుడు శ్రీ దొడ్ల నారసింహారెడ్డి తనయుడు కోదండరామిరెడ్డి బి.ఎల్. వివాహం 15 తేదీ నెల్లూరు టి.టి.డి.లో వైభవోపేతంగా జరిగింది.

### సరస్వతీనిలయం

శ్రీ కస్తూరిదేవి విద్యాలయం రిటైర్డ్ హెడ్‌మిస్ట్రెస్ శ్రీమతి పి. సావిత్రీదేవి ఇల్లు నిజంగా సరస్వతీనిలయమే. ఆమె ఎం.ఎ., ఆమె కొడుకులు, కోడళ్ళు, అల్లుళ్ళు, మొత్తం 9 మంది పోస్టుగ్రాడ్యుయేట్లు; ఒక కుమార్తె ఎం.బి., బి.ఎస్., ఈ విధంగా విద్యాసుగంధం గుబాళించే గృహం అది.

ఆమె కుమార్తె రమాదేవి బి.ఎ., బి.జి.ఎల్., రాజంపేట శ్రీ సింగంశెట్టి నారాయణ కుమారుడు, అడ్వొకేటు రవీంద్ర బి.ఎ., ఎల్‌ఎల్.బి వివాహం 15 తేదీ కర్నూలు బి క్యాంపులోని విజ్ఞానమందిరంలో జరిగింది.

### రాజు వివాహం

నెల్లూరు-రాజా ట్యుటోరియల్స్ ప్రిన్సిపాల్ శ్రీ కె. ప్రభాకరరాజు, రేనమూరు-శ్రీ కె. పెదవెంకటరాజు కుమార్తె హైమవతిని 15 తేదీ గూడూరు డి.ఎల్. ఆర్. కమ్యూనిటీ హాలులో పరిణయమాడారు.

★

## వేమన

(9 వ పేజీ తరువాయి)

చరిత్రనే తారుమారుచేసే ఇలాంటి అనర్థాల్ని భరించలేం!

విశ్వద నాట్యం చిత్రంలోని ఆధునిక వేమన్నతోపాటు ప్రేక్షకుల్ని శృంగార ఉయ్యాలలూగిస్తుంది చరిత్రను యథాతథంగా చిత్రించలేని దర్శకుని ప్రతిభా పాటవాలు, నృత్యదర్శకుడు కనుమర్తి సహాయంతో రూపొందించిన విశ్వద నాట్యాలు సినిమాకు మంచి కట్టును తేవడాన్ని హర్షించాలో, విమర్శించాలో అర్థంకావటంలేదు. వేమన పద్యాలను సైతం మార్చి, ఆ అర్థంతో, వేరే కథ ప్రయోగంతో, పద్యం చెప్పిన ఘనత ఈ 'చిత్ర' కారులది. దాంతో పద్యాల స్వారస్యాన్ని కోల్పోయి ప్రేక్షకుడికి వీనులవిందు చేయలేక పోయాయనడం అతిశయోక్తి కాబోదు.

మూఢవిశ్వాసాలపై, కర్మ వ్యవస్థపై వేమన తిరుగుబాటును మాత్రం చక్కగా చూపించారు. ఆయనలోని మానవసేవా దృక్పథాన్ని విశ్లేషించినతీరు ప్రశంసనీయం.

విజయచందర్ వేమనగాకాక, మరో అవతారపురుషుడిగా, శృంగార నాట్యకారుడిగా చక్కగాఅతికిపోయారు. ఆయన నటన మరోసారి షిర్డీ సాయిబాబాను గుర్తు చేస్తుంది. వేమన మహాభినిష్క్రమణవేళ ఆయన అభినయం బాగుంది. విశ్వదగా అర్చన వంటి విరుపులు, చిరునగవుల గలగలల్తో చేసిన శృంగార నాట్యం గొప్పగావుంది. ఈనాటి అర్థనగ్న నర్తకీమణులను సవాల్ చేసింది. వేమన వదినగా కె.ఆర్. విజయ, అభిరామయ్యగా చంద్రమోహన్ బాగా నటించారు.

అజ్ఞానపు స్వరూపాన్ని తెల్పుకో వడమే జ్ఞానమనిచెప్తూ, చీకటును తొలగించే చిదుత్తయత్నమే తపస్సుగా వర్ణిస్తూ, తపస్సుకు పోవలసింది హిమాలయాలకుకాదు జనహృదయాల్లోకి అని క్రొత్తఅర్థాన్ని చెప్పినట్టు తన మాటలశరాలు వదిలిన జాన్సన్ ప్రతిభకోనమస్కారం! వేటూరి, ఆత్రేయ, సీతారామశాస్త్రిల పాటలు చిత్రానికి వన్నెతెచ్చాయి.

మొత్తానికి ఈసినిమాను మామూలుగా చూస్తే రంజింపజేస్తుంది. వేమనగాచూస్తే బాధింపజేస్తుంది.

## సినిమా

(9 పేజీ తరువాయి)

'శంకరాభరణం' లో మంజుభార్గవి కొడుకుగా నటించిన తులసి ఈ చిత్రంలో హీరోయిన్. శేఖర్‌సుమన్, హరిప్రసాద్, సూతన్ ప్రసాద్, సాక్షి రంగారావు, బాలాజీ, అమీర్, వై. విజయ నటిస్తున్నారు. రచన:కాశీవిశ్వనాథ్, సంగీతం: చక్రవర్తి, నిర్వహణ: ఉట్లూరి రామారావు, దర్శకత్వం: ఎ. మోహన్‌గాంధి. ఈ చిత్రంలో రాళ్ళపల్లి, వేలు, వీరభద్రరావు, రచయిత కాశీవిశ్వనాథ్ గెస్ట్‌గా కనిపిస్తారు. అనవసరంగా దుబారా చేయకుండా తక్కువ బడ్జెట్‌లో రసవత్తరమైన చిత్రాన్ని నిర్మించి, విజయవంతం చేయడంలో నిర్మాతగానూ తాను దిట్ట అని రామోజీరావు ఏనాడో రుజువుచేసుకున్నాడు.

### పి. ఆర్. ఓ. ల పని నిక్షేపంగావుంది

"మేం తీసేపిక్చర్లవల్ల నష్టపోతే మునిగిపోతాం. కాని, మేంతీసే పిక్చర్ల తాలూకు స్టిల్స్ ను పత్రికలవారికిచ్చి అందుకు మావద్దనుంచి ఐదువేలో పదివేలో ఒక్కోచిత్రానికి వసూలుచేసే జర్నలిస్టుల సంపాదన క్షేమంగావుంది. వీళ్ళలో కొందరికి కార్లువున్నాయికూడా" అని వ్యాఖ్యానంచేశారు ఇటీవల ఓ నిర్మాత.

నిజమే ఎవరో ఇద్దరు ముగ్గురుతప్ప చాలా పత్రికలలో పనిచేసే జర్నలిస్టులకు ఇది అదనపు సంపాదన అయింది. ఎవరైనా కొత్తగా చిత్రాన్ని ప్రారంభించబోతున్నారని తెలిస్తేచాలు- ఆ కార్యాలయంచుట్టూ పోటీలుపడి మూగుతారు. చివరికెవరో ఒకడు ఆ పి.ఆర్.ఓ. అయిపోతాడు. అలా సంపాదించిన డబ్బుతో డబ్బింగ్ చిత్రాలుతీసిన జర్నలిస్టులు కూడావున్నారు. దీనితో ఒకరిమీద మరొకరికి ఈర్ష్యతోలేనిపోనికతగాదాలుతెచ్చుకొని చిత్రపరిశ్రమలోనివారి దృష్టిలో చులకనైపోతున్నారు ఈ జర్నలిస్టులు. తమ వృత్తిధర్మాన్ని వదలి ఇలా ఇక్కట్టులు తొక్కడమెందుకు? జర్నలిజం పరువు తీయడమెందుకు?

## చెరకుయాత్ర

(4 వ పేజీ తరువాయి)

ప్రగంగా తెలిసిన వ్యవసాయకుడు శ్రీ ఎం. బాగారెడ్డి నల్లా రాఘవరెడ్డి, ఎం. ఓంకార్, శాసనసభ స్పీకర్ జి. నారాయణరావు వంటి ఇతర నాయకులు పాల్గొన్నారు

మన రాష్ట్రానికి సరిపడే చెరకు రకాలు, చెరకుసాగు పెంచడానికి రికవరీ పెంచడానికిగల అవకాశాలు, అవసరాలు తదితర అంశాలపై కూలంకషమైనచర్చ జరిగింది. కొత్త చక్కెర ఫ్యాక్టరీలసంఖ్య పెంచడం, వున్న వాటిని ఆధునీకరించడం వంటి విషయాలుకూడా ప్రస్తావనకు వచ్చాయి.

సమావేశం చివరలో కొన్ని నిర్ణయాలు చేయడం జరిగింది. చెరకులో నూతన రకాలు ఉత్పత్తిచేసి, వరఫరా కేంద్రాలు స్థాపించి, వాటిద్వారా అందరికి అందుబాటులో వుంచాలని నిర్ణయించారు. చెరకు నరికేముందు పక్వానికి వచ్చిందీ లేనిదీ నర్వేజరపడం, ఫ్యాక్టరీకి సకాలంలో సరఫరా చేయడం, వచ్చింది సకాలంలో మరాడింపడంవంటి చర్యలు చేపట్టడంద్వారా రికవరీశాతం పెంచాలని అనుకున్నారు. ఫ్యాక్టరీ యజమానులు, రైతులతో సామరస్యంగా మెలగాలని, వారిలో విశ్వాసం పెంపొందింపజేయాలని ఆదేశించారు.

బాగారెడ్డిగారు సదస్సులో ప్రభుత్వానికి ఫ్యాక్టరీ యాజమాన్యాలకు, రైతులకు మంచి సూచనలిచ్చారు. నరికిన చెరకు క్రషింగ్ చేయకుండా ఒక్కరోజు ఫ్యాక్టరీలో వుంచితే, 1 శాతం రికవరీ తగ్గిపోతుందన్నారాయన. మెలాసిస్ విషయంలో తగినజాగ్రత్తలు తీసుకుంటే, చక్కెరపరిశ్రమ ఎంతో బాగుపడుతుందన్నారు. ఐదుటన్నుల చెరకుకు పాతికటన్ను మొలాసిస్ వస్తుంది; ఐదుటన్నుల మొలాసిస్ ధర మార్కెట్‌లో 72 వేలు; కానీ ప్రభుత్వం రూ 7 200 లకే తీసుకుంటుంది. దానిపై మళ్ళీ ఎక్సైజ్ డ్యూటీ చెల్లించాలి. ఇంత ప్రాముఖ్యం కల్గిన పరిశ్రమను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్లక్ష్యంచేస్తున్నాయి. ఈధోరణి మారాలి అన్నారు. మహారాష్ట్రలోవలె ఇక్కడకూడా చెరకు నరికించి రవాణా చేసే బాధ్యత ఫ్యాక్టరీలే తీసుకోవాలని సలహా ఇచ్చారు.

శాసనసభ స్పీకర్ శ్రీ జి. నారాయణరావు, మన రాష్ట్రంలో ఫ్యాక్టరీల నష్టాలకు యాజమాన్యలోపం, లంచగొండితనం ప్రథమ కారణమని ఆరోపించారు. మనరాష్ట్రంలో మేనేజింగ్ డైరెక్టర్లు కారు దిగరు; కానీ మహారాష్ట్రలో వారు బస్సుల్లో తిరుగుతారు. సిబ్బందికూడా అంతే వారిలో అధికభాగం చెరకు ఉత్పత్తిదారుల కుటుంబాలలోనివారేనని చెప్పారు.

మొత్తమ్మీద ఈ పదిరోజుల విజ్ఞాన యాత్ర రైతులకు చాలా ఉపయుక్తంగా వుండింది. ఎంతో విజ్ఞానదాయకమైన సమాచారం సేకరించగల్గాం. ఈ సమాచారాన్ని భవిష్యత్తులో ఫ్యాక్టరీల నిర్వహణకు ఉపయోగపెట్టుకోగల్గితే మన రాష్ట్రంలోకూడా చక్కెర పరిశ్రమ బాగుపడుతుంది; చెరకును నమ్ముకున్న రైతూ అభివృద్ధి చెందుతాడు.

★

## సమరసన్నద్ధత (మొదటి పేజీ తరువాయి)

గుణపాఠం చెప్తామనికూడా హెచ్చరించారు. ఆత్మరక్షణ అన్నది ఏదో ఊతపదమైపోయింది.

పొగతోటలోని ఆర్. ఎస్. ఎస్. ఆఫీసును 16 వతేదీ పోలీసులు సీలుచేశారు; కత్తులు కటార్లవంటి ఆయుధాలు పెద్ద ఎత్తున స్వాధీనం చేసుకున్నారు 22 మంది బి. జె. పి., ఎ. బి. వి. పి. కార్యకర్తలను అరెస్టు చేసి రిమాండుకు పంపారు.

సి పి ఎం తరఫునకూడా 8 మంది అరెస్టయ్యారు; మరొక ముగ్గురో నలుగురో అరెస్టు కావచ్చునని తెలుస్తూంది. మార్క్సిస్టు ఆఫీసునుమాత్రం పోలీసులు సోదాచేయలేదు. పోలీసులు అందరు వెళ్ళినతర్వాత జక్కా వెంకయ్య లోపల విశ్రాంతి తీసుకుంటున్నందువల్ల వెనక్కు వెళ్ళిపోయారట. ఈ వార్తను వెంకయ్య గారుకూడా ఖండించలేదు. దానితోపాటు పార్టీ ఆఫీసులో ఆయుధాలు వుండడంలో తప్పులేదని, ఆత్మరక్షణకు అవసరమని ఆయన అన్నారు. వారి ఆఫీసులో ఆయుధాలు వున్నాయోలేవో మనకు తెలియదుకాని, దాదాపు వందమంది కార్యకర్తలు, 50, 60 మంది విద్యార్థులు మాత్రం అక్కడ వుంటున్నారు. వారికి భోజనాది వసతులుకూడా పార్టీయే సమకూరుస్తున్నట్టుంది. ఇంత మందిని ఎందుకు మోహరించివున్నారో తెలియదు.

విచిత్రమైన విషయమేమిటంటే, ఇంత ఉద్రిక్తత నెలకొన్నప్పటికీ అటు సి. పి. ఎం. ఇటు ఆర్ ఎస్ ఎస్ సంస్థల మధ్య ప్రత్యక్ష స్పర్థ లేవీ వున్నట్టు ఎవరూ చెప్పడంలేదు. కాలేజి విద్యార్థి సంఘం ఎన్నికలలో ఎస్ ఎఫ్ ఐ, ఎబివిపి విద్యార్థులమధ్య రేగిన కలహాలనే ఇద్దరూ ప్రస్తావిస్తున్నారు. ఆవేశకావేషాలు పెరిగిందీ పెంచుకున్నదీ ఈ సంస్థలేనట. మనవిద్యార్థుల రాజకీయాలు ఎంతటి వెర్రితలలు వేస్తున్నాయో చూడండి!

పోలీసు బందోబస్తు కొంచెం అతిగానే లేకుంటే నెల్లూరు ఈపాటికే పెద్ద యుద్ధరంగమైపోయి వుండేదన్నమాట వాస్తవం. భక్తవత్సలనగర్ కొట్లాట తర్వాతరోజు రెండుపక్షాలవారూ కర్రలు, కత్తులుపట్టుకుని బహిరంగంగానే టౌనులో తిరిగారు. అదృష్టవశాత్తు ఆరోజేమీ సంఘటనలు జరగలేదు.

మార్క్సిస్టుల వైపునుంచి పోలీసుల పైన చెప్పుకోదగిన ఫిర్యాదులేవీలేవుగాని ఆర్ ఎస్ ఎస్ వారు మాత్రం పోలీసులే పరిస్థితిని శృతి తప్పిస్తున్నారని ఆరోపిస్తున్నారు. భక్తవత్సలనగర్ కొట్లాటలో తమపై దాడిచేసి 9 మందిని తీవ్రంగా కొట్టిన సి పి ఎం కార్యకర్తలను అరెస్టు చేయడంలో పోలీసు అలక్ష్యంవహించిందన్నది ప్రథమఫిర్యాదు; టౌన్ సర్కిల్ ఇన్స్‌పెక్టర్ మురళి ఎబివిపి విద్యార్థులపై అనవసరంగా కక్ష పెంచుకొని, సంస్కారహీనంగా వ్యవహరిస్తున్నాడని, తామెంతో పవిత్రంగా చూసుకొనే ఆర్ ఎస్ ఎస్ ఆఫీసులో పోలీసులు పేకాట వంటి వ్యసనాలు తీర్చుకుని, అపవిత్రం చేశారని, కాలేజి ఎన్నికలప్పుడు తమ విద్యార్థులను మార్క్సిస్టులు కొడితే ఇప్పటికీ ఆ కేసులు కోర్టువరకుకూడా పోలేదని బిజెపి నాయకుడు శ్రీ ఎం. వెంకయ్య నాయుడు ఆరోపణ. తమవారిని అన్యాయంగా మార్క్సిస్టులు కొట్టినా, పోలీసులు అనవసరంగా అరెస్టుచేసినా తాము మాత్రం ప్రతీకారచర్యలకు పాల్పడమని, ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తలందరినీ గోదావరిజిల్లాలలో సహాయ కార్యక్రమాలకు పంపేస్తున్నామని చెప్పారు.

మొత్తంమీద ఇప్పుడుమాత్రం పరిస్థితి ప్రశాంతంగానేవుంది. ఇంతటితో సర్దుకుంటారా, లేక పోలీసు సహారా తగ్గినతర్వాత తిరిగివిజృంభిస్తారా అన్నది వేచిచూడదగిన విషయం. భక్తవత్సల నగర్ కొట్లాట తర్వాత పరిస్థితి అదుపు తప్పకుండా జాగ్రత్తపడిన ఎస్ పి. ని మాత్రం అభినందించితీరాలి ఆయన అంత అప్రమత్తతతో వ్యవహరించక పోతే నెల్లూరు మరో కేరళ అయి వుండేది. ★



## కోవూరు గ్రామ పంచాయితీ

(8వ పేజీ తరువాయి)

| | | |
|---|---|---|
| 58) అన్నం రమణారెడ్డి ఇంటినుండి ఆర్ బి. రామి ఇంటి వరకు రోడ్డు రిపేరు చేయుట | 7000/- | 350/- .. |
| 59) వీరపురెడ్డి నరసారెడ్డి ఇంటినుండి యరమార గోపాలరెడ్డి ఇంటివరకు మెటల్ రోడ్డువేయుట | 5500/- | 275/- .. |
| 60) కొత్తూరు రామమందిరం రోడ్డులో కాలువపై RCC స్లాబులువేయుట | 8600/- | 430/- .. |
| 61) కోనేటికయ్యలలో కాకి రమణమ్మ ఇంటి వద్దనుండి గ్రావెల్ రోడ్డు వేయుట | 2800/- | 140/- .. |
| 62) కోనేటి కయ్యలలో యల్లం వీరారెడ్డి ఇంటి వద్ద పబ్లిక్ ట్యాప్ యేర్పాటుచేయుట | 1600/- | 80/- .. |
| 63) కోనేటి కయ్యలలో కొండా నాగరాజు ఇంటి వద్ద పబ్లిక్ ట్యాప్ యేర్పాటు చేయుట | 1600/- | 80/- .. |
| 64) కోనేటి కయ్యలలో తిరువీధి గోపాలయ్య ఇంటివద్ద పబ్లిక్ ట్యాప్ యేర్పాటుచేయుట | 1600/- | 80/- .. |
| 65) కోనేటి కయ్యలలో వేమయ్య ఇంటివద్ద పబ్లిక్ ట్యాప్ ఏర్పాటుచేయుట | 1600/- | 80/- .. |
| 66) మసీదువీధిలో కాలువ నిర్మించుట | 1300/- | 65/- .. |
| 67) లక్ష్మీనగరు ఎలిమెంటరీ పాఠశాల నుండి కృష్ణవేణమ్మ ఇంటి వరకు గ్రావెల్ రోడ్డు వేయుట | 1200/- | 60/- .. |
| 68) జక్కలవారివీధిని గ్రావెల్ చేయుట | 300/- | 15/- .. |
| 69) మందబయలు GNT రోడ్డు నుండి ఉలవపాటి వెంకయ్య ఇంటివరకు మెటలు రోడ్డు వేయుట | 1900/- | 95/- .. |

-టి. రమణయ్య కార్యనిర్వహణాధికారి



మేమంటే ఎంతో అభిమానం, ఆదరణ చూపించి

నిరంతరం మా హృదయాంతరాలలో నిల్చిపోయిన

మా ఇలవేల్పు మా అవ్వ

# మాగుంట కృష్ణమ్మగారి

## చతుర్థ వర్ధంతి

**23-8-86 తేది శనివారం**

నెల్లూరులో జరుగును.

ఆమె పవిత్రాత్మకు భగవంతుడు

శాంతిని చేకూర్చమని ప్రార్థిస్తూ-

మాగుంట సుబ్బరామ రెడ్డి మరియు సోదరులు

సిద్దవరపు మధుసూదన రెడ్డి

సంపాదకుడు ముద్రాపకుడు ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామమూర్తి, జమీన్‌రైతు ప్రెస్, 17/170, అచ్యుతానాయుడు వీధి, నెల్లూరు 524001